శ్రీ

# చతురచంద్రహాసము.

అయిదంకముల నాటకము.

ఇది

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే

రచియింపఁబడి





మొదటి కూర్పు 3000 ప్రతులు.

మట్టె సుబ్బారావుగారిచే

ప్రకటింపఁబడియె

రాజమహేంద్రవరము.

1922

దీనివెల 0—8—0

## ఈనాటకమున వచ్చుపాత్రలు.

హేమవర్మ — కుంతలదేశపురాజు

భాగురాయణుడు — కుంతలదేశపుమంత్రి — (ఈతని కేదుష్టబుద్ధియని పేరు)

ఉగ్రసేనుడు — కుంతలదేశపు సేనాని

జయంతుడు — మాళవదేశపు రాజుచే బంపఁబడిన బ్రాహ్మణుడు

సుమంతుడు — పుళిందదేశపుమంత్రి

మదనుడు — భాగురాయణుని కొడుకు

ఇంద్రదత్తుడు — పుళింద దేశాధిపతి

చంద్రహాసుడు — పుళిందాధిపునిదత్తపుత్రుడు — కథానాయకుడు

మందరుడు } భాగురాయణుని సేవకులు
శౌనకుడు

చారాయణుడు — చంద్రహాసుని కంచుకి

భీముడు } కుంతలపురములోని కాళికాలయరక్షకులు
భైరవుడు

గాలవుడు — కుంతలేశ్వరుని పురోహితుడు

### స్త్రీలు.

విషయ — భాగురాయణుని కూతురు — కథానాయిక

కాంచనమాల — విషయ చెలికత్తె

ఇంకను కంచుకి, సేవకులు, పౌరులుమున్నగువారు వచ్చెదరు.

# చతురచంద్రహాసము.

## నాంది.

మ. కనులం జూడక యున్న నెవ్వని శుభాకారంబు, నెవ్వాని మేన్
మనకేలన్ స్పృశియింపకున్న, వినకున్న న్వీనులంబోల్చి యె
వ్వని కంఠధ్వని, విశ్వముం గన ననిర్వాచ్యుం డెవం డున్న వాఁ
డని తోఁచున్నది, దానికిం గొరకఁడేఁ డా వేల్పు మిమ్మేలుతన్.

మఱియు,

తే. గీ. విబుధకోటికి విజ్ఞేయ విషయ మగుచు
నమిత మోహాలతా చంద్రహాస మగుచు
భువన నిర్మితి నిర్దుష్ట బుద్ధి యగుచుఁ
గ్రాలు నా పరవస్తువు కాచు మిమ్ము. 2

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి సభవంకఁ జూచి)

సూత్ర—

మ. కలమే ఖడ్గము, శాస్త్రమే దళము, విజ్ఞానంబె శౌర్యంబు గా,
వల దజ్ఞానవిరోధి మండలము చేవందాఁకి తూలించి ని
శ్చల ధర్మంబులు ధాత్రినిల్పు కవితాసామ్రాజ్య పట్టాభిషి
క్తుల, విద్వన్నృపులం దృణీకృతమహాక్షోణీంద్రులం గొల్చెదన్. 2

(అని పుష్పాంజలిఁ జల్లి, తెరవంకఁ జూచి)

సూత్ర—మారిషా! నీవొకసారి యిటు రమ్ము.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) బావా! నా కిప్పు డేమి నియోగము?

సూత్ర—ఏమినియోగ మని యడుగుచున్నావా? ఈరాత్రి మన విమరంగస్థలమున నొక రూపకప్రయోగముఁ జేయఁ దలఁచినమాట మఱచితివా?

పారి—మఱవలేదు. రంగస్థలమున నంతయు సిద్ధముగ నున్నది. కాని బావా! నాగ్రహింపకుందువేనిఁ జిరకాలమునుండి నా మనంబును బీడించుచున్న యొక సంశయమును నిన్నడిగి తీర్చుకొనవలయు నని యున్నది.

సూత్ర—ఓభీరుఁడా! ఆగ్రహముతోఁ బని యేమి? సంశయ మెఱిఁగింపుము.

పారి—ఇదిగో వినుము. మనము వేడుక దీర్చుకొనుట, ధనమార్జించుట
కొఱకుఁ దక్క యీనాటకమువలన నేమి ప్రయోజన మున్నది ?

సూత్ర—(నవ్వి) ఓ వివేకదూరుఁడా ! నాటకములవలన మనవంటి విలా
లకు వేడుక తీరుటయే ప్రధానప్రయోజన మైనను, దీనికంటెను వేయిమడుంగు లు
మైన ప్రయోజనము మఱియొండు కలదు. అది యే దనిన, లోకులకు ధర్మముల
శించుటయే.

పారి—ప్రాచీనకవినిర్మితము లగు కావ్యపురాణేతిహాసములఁ జదువుకొన్న
ధర్మములు, లోకులకు సుబోధములు గావా ?

సూత్రి—కావు. ఏమనిన;

తే. గీ. అతివినోదమిశ్రితములై నవ్వుదే గాక
మదికి నెక్కవు వట్టి ధర్మములు పలుకఁ
దేనె బూసిన మ్రింగింప నౌను గాదె
చేదుమందుల నేనియు స్వాదులట్లు.

మఱియు శ్రవ్యకావ్యములకు దృశ్యప్రబంధములకుఁ గలభేద మించుక చెప్పెద. విను

మ. శ్రవణానందము చేయు శ్రోతలకు సారంబైన గానంబు, స
త్కవి నిర్మించు మహాప్రబంధము లలంకారప్రపూర్ణంబు లై
చెవికి, న్నెమ్మదికిం, బ్రియంబులగు ; వాసిన్ దృశ్యకావ్యంబు క
న్గవకు న్వీనులకు, న్మనంబునకు, నానందంబు గల్పించెడున్.

దృశ్యప్రబంధంబులందుఁ దక్కిన కావ్యములందుఁ గనఁబడని విశేషము మఱియొకటి !
అది యే దనిన,

మ. ఇల నేదేశము నందొ, యేనగరినో, యేనాఁడో జీవించు వా
రల చారిత్రము నేఁటి కేయి మన యీరంగస్థలంబందుఁ గ
న్నులకుం గట్టునటు ప్రయుక్త మగు చుండుం గావున న్సత్కథా
ఫలితార్థంబులు ముద్రితంబు లగు నేవ న్నాటుఁ జిత్తంబులన్.

పారి—బావా ! యుక్తియుక్తము లగు నీవచనములచే నాసంశయము తీ
"ఏకక్రియాద్వ్యర్థకరీ" యనునట్లు నాటకప్రయోగము నటులకు వినోదప్రద
మటయే గాక, జనులకు ధర్మమార్గప్రదర్శక మై యుండును. ఇంకఁ బ్రస్తుతము వి
తము. మనము ప్రయోగింపఁబోవు రూపకము పే రేమి? తద్గ్రంథకర్త నామధేయ మే

సూత్రి—మారిషా ! కృష్ణామండలాంతర్గత వీరవాసరగ్రామీణుఁడు, శ్రీవ
ద్రమండల మండనాయమాన రాజమహేంద్రవరనగర నివాసి, యారామద్రావిడశా

# చతురచంద్రహాసము.

అంటుమామిళ్ళు ఘనవంతు లారగింప
జీడిమామిళ్లు పేద భక్షించుఁగాదె.

పారి—సరే. నీ వాదము నే నొప్పుకొంటి. అప్రస్తుతవిషయాసము[illegible] బడి మన మిరువురముం గొట్టుకొనిపోవుచుఁ బ్రకృతమును విడుచుచున్నా[illegible] చంద్రహాస రూపకమువలన లోకమునకు వెల్లడి యగునీతులు ధర్మములు [illegible] చున్నాఁడను.

సూత్ర—ఈకథార్ణవమునం దట్టినీతిరత్నములు లనేకములు గలవు. చూడుఁడు.

శా. స్వామిద్రోహము లోఁ దలంచుకొని యీర్ష్యాదుర్గ్రహావిష్టుఁ డై,
నేమం బేమియులేక కోరికలకున్, నింద్యక్రియారంభుఁ డై
వ్యామోహంబున సాధులం జెఱుపగా యత్నించు క్రూరుం, డెదన్
బాము ల్వొందుచు దుష్టబుద్ధి పగిది న్నాశంబు నొందుం దుదిన్.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---



# చతురచంద్రహాసము

## ప్రథమాంకము.

### కుంతలపురము — మంత్రిమందిరము.

[అప్పుడు మంత్రి ప్రవేశించుచున్నాడు.]

మంత్రి—(తనలో) రాజోపజీవులలో మంత్రియే సర్వోత్కృష్టుఁడు. ఏలయన-

తే. గీ. మకుట మాదల నిడఁడన్న మాటెకాని
కనకసింహాసనము నెక్కఁడను టెకాని
సచివుఁడే యేలుచుండును క్ష్మాతలంబు
రాజు గుడిలోని మూలవిరాట్టువోలు. 1

మఱి మంత్రులో, యర్చకులట్లు కోట లనియెడి కోవెలలందు నరదేవులను మంత్రతంత్ర బలంబుల బంధించి, కాలోచితముగఁ గార్యనివేదనము చేయుచు, నిత్యోత్సవంబులు, సర్వోపభోగంబులు, కైంకర్యంబులు యథాసమయముగ నెఱపుచుఁ దత్ప్రసాదంబులు స్వీకరించి, సకలైశ్వర్యంబులు వానితో సమానముగఁ దారు ననుభవించుచుందురు. ఇట్లు భావించుటకుఁ గారణ మేమన, రాజు,

తే. గీ. సోగకన్నోయి గల్గియుఁ జూడలేడు
వెడద వీనులు గల్గియు వినఁగలేడు
చేతులుండియు నొకపని చేయలేడు
పలుక నేర్చియు స్వేచ్ఛమై పలుకలేడు. 2

వెండియు, నాత్మగౌరవగోపనంబు నెపంబున,

చ. ధరణివిభుండు భూప్రజకు దర్శనమీయఁడఁ డాలకింపఁడే
నెపుడు, నిజకార్యనిశ్చయము నోపు నమాత్యుని మీఁద, మంత్రియే
నరపతికన్ను, వాఁడె జననాథునకుం జెవి, వాఁడె ధారుణీ
శ్వరుని భుజంబు, వాఁడె క్షితిపాలు శిరస్సు, మనస్సు నాతఁడే. 3

అంత యదృష్టము నాకు లభించునే ? నాకుటుంబము కుంతలరాజకుటుంబ మగునే ? వందులు కైవారములు సేయ, మాగధులు వంశకీర్తనలు సలుప, వైతాళికులు కాల్యకృత్యములు విజ్ఞాపింప, ప్రగ్గడలు రాజకార్యములు నివేదింప, రాయబారులు వినయమున సందేశము లెఱిఁగింప, శ్రీమంతు లగుసామంతులు పాదాక్రాంతులై కొలువ, వేత్రహస్తులు సాహసోనినాదములతోఁ బరాకులు తెలుప, రెండవ యాఖండలుండునుంబోలె పసిండిగద్దియ నెక్కి నిండుకొలువుండు భాగ్యము నాకుఁగాని నాకుమారుఁ డగుమదనునకుఁగాని పట్టునే ? ఏల పట్టక యుండును ? కార్యములు ప్రయత్నసాధ్యములు.

తే. గీ. పురుషకారంబె చెలి ఫలంబులకు నెల్ల
పురుషకారంబె సిరికి మొదటికుదురు
పురుషకారంబె దైవంబు భూతలమునఁ
బురుషకారంబె కల్పించుఁ బూర్ణజయము. 8

పురుషకారంబునందు దృఢవిశ్వాసముఁ గలవాఁడనగుటచేఁ గాదె పదునాలుగేండ్లక్రిందట జ్యోతిషులు దిక్కుమాలిన యొక చక్కని కుఱ్ఱనిఁ గాంచి యతఁడు చక్రవర్తిలక్షణలక్షితుఁ డనియును, దప్పక కుంతలంబున కధీశ్వరుఁ డగుననియుఁ జెప్ప నే నది సహింపక నామార్గంబు నిష్కంటకము గావింపఁ దలంచి నరహంతకులఁ బిలిచి యా బుడుతనికి నాఁటిరాత్రియే యమలోకవాససౌఖ్య మిప్పించితిని. నాఁటంగోలె నే నీస్వప్నసామ్రాజ్యమున దేలియాడుచుంటిని. అందుకు నిమిత్తము వెతకుచుంటిని. ఇంకఁ బరీక్షించినఁ గార్యము లేదు. రాజ్యమెట్లయిన గ్రహింపవలయును. ఏమి యుపాయము ?

ఉ. చంపుదునా నృపాలకునిఁ ? జంపితినా ప్రజ నైపవీపనిజ
జంపక యున్న రాజ్యము నా వశవర్తిని యౌట యెట్లు ? ఆఁ!
చంపకగంధి యున్నది చంపకనామక రాజపుత్రి, నే
పెంపెసలార నయ్యువిదఁ బెండిలి సేయుదు నాసుపుత్రకున్. 9

రాజునకుఁ బుత్రసంతానము లేమిం జేసి యామహీపాలుని పిమ్మట నాపుత్రుఁడు కుంతలంబునకు రాజగును. కాని, రాజు చంపకను నా కుమారున కిచ్చి వివాహము సేయునా ? దానికిం దగిన యుక్తులు నే పన్నఁజాలనా ? జయంత సదృశుఁ డగు నా కుమారునికన్న మంచి యల్లుఁ డీరాజునకు లభించునా ?

[అప్పుడు కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—దేవా ! మాళవేంద్రుని పురోహితుఁ డగుజయంతుఁడు మీ దర్శనమును గోరుచున్నాఁడు.

మంత్రి—తత్క్షణము ప్రవేశపెట్టుము.

[అంతట జయంతుండను బ్రాహ్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

జయం—జయతు జయతు మహామంత్రీ.

మంత్రి—అనూచానున కభివాదము సేయుచున్నాఁడను.

జయం—మనోరథము సిద్ధించుఁగాక!

మంత్రి—దేవా! మీ పాదధూళిచే నాగృహమును పావనము చేయించినకార్యవిశేషము వినఁగోరుచున్నాఁడను.

జయం—అమాత్యశేఖరా! అవధారు. మాళవేంద్రునకు వసంత, నలకూబరసమానసుందరుఁ డగునందనుఁడు కలఁడు. అతఁ డిప్పుడు సంప్రాప్తయౌవనుఁ డగుటం జేసి జనకుఁడు వాని గృహస్థాశ్రమంబునఁ బ్రవేశపెట్టందలంచి రూపశీలలావణ్యధన్య లగుకన్యలనిమిత్తము వెదకి యొందునుం గానక, మీరాజునకు భువనమోహినియగు చంపక యనుకూఁతురు కలదని విని యామెం దనకుమారుని కిప్పింపు మని నిన్ను వేఁడ నన్నుం బనిచె. ఇదె నా సందేశార్థము.

మంత్రి—(తనలో) ఆలస్యమున నమృతము విషమగు నన్నలోకోక్తి యథార్థమగుచున్నదే. నా యుపేక్షకతమున రాజకన్య పరాధీన యగు నని తోఁచుచున్నది. అయినను బ్రస్తుతము కార్య మెంతవఱకు పాకము దప్పినదో కనుగొనియెద. (ప్రకాశముగా) ఆర్యా! మీరు మహారాజుగారి దర్శనము చేసి వచ్చిరా?

జయం—లేదు. ముందే మీయొద్దకు వచ్చితిని. ప్రథమమున సచివదర్శనముఁ బిదప నృపదర్శనము కదా.

మంత్రి—(తనలో) అదృష్టమా! నీవు నన్నిప్పటికి విడువలేదు. (నిట్టూర్పు విడిచి) (ప్రకాశముగా) ఓమహీదేవ! నేను మిక్కిలి మందభాగ్యుఁడను. ఏమన,

శా. సరిగా నున్నది యున్నటు ల్పలుక రాజద్రోహినై పోదు, ట
క్కరినై నే ననృతంబు పల్కు నెడ లోకద్రోహినై పోదు, పా
మరుఁ డట్లారక యుందునన్న నపు డాత్మద్రోహినై పోదు హా
నరుఁ డంతఃకరణానువర్తి యయి యుండం జాలఁ డీ ధారుణిన్.

జయం—(ఆశ్చర్యముతో) అయ్యా! మీపలుకుల కర్థము తెలియకున్నది. ఇందు విషాదమున కెడ మేమున్నది?

మంత్రి—అదృష్టహీనురా లగు మారాజకన్యను మీ యువరాజు నిమిత్త మడుగుటయే నాకు విషాదహేతువు.

జయం—(తెల్లబోయి) ఏమి? అదృష్టహీనురాలా?

తే. గీ. చక్కఁదన మున్నదంట నేలబాలతనము
కరము గలదంట ; కలదంట కలిమితనము
మంత్రి—ఎన్ని తనము లుండిన మన కేమిఫలము
తలిరుఁబోఁడికి సైమతేనమె కొఱంత. 11

జయం—కటకటా! ఎంతకష్టము. ఈబాలిక సర్వమంగళి యని లోకు లనుకొనుచున్నారు.

మంత్రి—జనవాక్యమునకు సత్యమునకుఁ జాల దవ్వు. మాళవేంద్రుఁడు నాకుఁ బరమాప్తుఁడు కావున వాని మేలుగోరి నేను సత్య మెఱిఁగించుచున్నాను. ఈబాలిక వివాహిత యైన మూఁడు నెలలకు భర్తకు గొప్పగండము గల దని జ్యోతిష్కులు నాకెఱిఁగించిరి. ఈరహస్యము మీరాజునకుం దక్కఁ దదితరుల కెఱిఁగింపవలదు. ఎఱిఁగించిన నా తలమీఁదికి వచ్చును. మిత్రుని క్షేమ మెదఁగోరి నేను శిరచ్ఛేదమునకైన నొప్పుకొంటిని.

జయం—(లేచి మంత్రిచేతులు పట్టుకొని) అమాత్యశేఖరా! నీవు మాపాలిఁటి దైవంబవు. మారాజునకు నీవు పుత్రభిక్షము పెట్టితివి. ఈరహస్యము మేము బయలు పుచ్చము. నీ మేలు మఱవము. నాకు సెల వొసంగుము.

మంత్రి—మాళవేంద్రునకు నా వందనములఁ దెల్పుము. నా నమోవాకము గ్రహింపుము.

జయం—కల్యాణమస్తు. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—(తనలో) నా మంత్రశక్తిచేత రాజకన్యకకు వచ్చిన మంచి సంబంధములన్నిటి నిట్లేయంగునసే చెడఁగొట్టెద. అంతట రాజు తనకుమారిక కనుకూల వరుఁడు లభింపమిం జేసి యామె నెట్టకేలకు నాకుమారునకే యిచ్చి వివాహముఁ జేసి తీరవలయు. లేదా యావజ్జీవ మామెను బ్రహ్మచారిణిగా నుంచవలయును.

[అప్పుడు కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—దేవా! పుళిందరాజగు ఇంద్రదత్తుని వద్దనుండి సుమంతుఁడు వచ్చియున్నాఁడు.

మంత్రి—సత్వరము రానిమ్ము.

కంచు—చిత్తము. (అని నిష్క్రమించును. అంతట సుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సుమం—(తనలో) మహాసముద్రముల గాంభీర్యమైన నెఱుఁగ వచ్చును కాని ధూర్తుల హృదయమర్మముల నెఱుఁగరాదు. ఏమనిన

సుమం—దేవా! ఇవియే గావు. ఆకావడిపెట్టెలలో నున్న యమూల్యవస్తువు లన్నియు మీ నిమిత్తము తెచ్చిన కానుకలే. చిత్తగింతురు గాక. సె

మంత్రి—అవి మధ్యాహ్నము నందగవచ్చును. మహారాజుగారిని సందర్శించితివా?

సుమం—కానుక లర్పించి యిప్పుడే రాజసన్నిధినుండి వచ్చినాఁడను.

మంత్రి—మంచిపనిఁ జేసితివి. కాని, సుమంతా! పుళిందుఁ డేటేటఁ గుంతలేశ్వరునకు సమర్పింపవలసిన కప్పమే సరిగా నీయఁజాలకుండువాఁడు గదా యిప్పు డాతనికీ ధనసంచయం బెట్లు లభించినది?

సుమం—(తనలో) అయ్యో! ఈతఁడు వివరముప్రశ్నల నడుగ నారంభించి నాఁడు. మిత్రుఁ డని చెప్పరాదు. శత్రుఁ డని చెప్పకుండరాదు. అయిన నిట్లు చెప్పెద. (ప్రకాశముగా) దేవా! కలరుగదా కుంతలరాజ్యలక్ష్మికిఁ బ్రక్కలో బల్లెములట్లు మన యెల్లలలో వసించు నాటవికు లగుకిరాతప్రభువులు. ఆదురాత్ములు నీటిలోని మొసళ్లవడువున స్థానప్రబలిమిచేతఁ గుంతలరాజసైన్యంబుల కజేయులై యింతకాలమునుండి ప్రాంతభూములకుఁ జాలసారు లుపద్రవకరు లగుట ప్రాఁతకథయే గదా. ఆపర్వతీయు లీనడుమ విశృంఖలవృత్తిం జెలరేగి మనసీమల నున్న పల్లెల జనంబుల గోధనంబుల హరియించి గృహములఁ బరశురామప్రీతిఁ గావించి లోకకంటకు లైరి. అది కారణంబుగఁ బుళిందరాజు నిజసైన్యంబులఁ బంపి యామూకలకుంటకుల కంఠకావర మడంచి వారు ప్రజలవద్ద హరించిన రత్నకనకవస్తువాహనంబులఁ [illegible] కుంతలేశ్వరునకు, మీకు సాధనంబులై కానుకలుగాఁ బంపెను.

మంత్రి—మేలు పుళిందా! మేలు. నీకావించిన సాహసకృత్యము నీకానుకకంటె నెక్కుడు విలువ గలది. నీవిజయము మాకుం బ్రియము; మన యుభయులకు లాభకరము; లోకోపకారము. సుమంతా! ఈతనికార్యమును గణించి మీరాజును బహూకరించుటకు నే నొకసారి చందనావతికి రావలె నని యున్నది.

సుమం—(తనలో) ఈతని రాక మృత్యుదేవతాప్రవేశము గదా. ఇది సాగక పోవుఁగాక. (ప్రకాశముగా) దేవా! పుళిందుఁ డనుగ్రహింపఁబడును.

మంత్రి—సుమంతా! ఎంతధన మార్జించిన నేమి? ఎన్ని వైభవములున్న నేమి? పాపము, పుళిందునకు సంతానము లేదుకదా!

సుమం—దేవరవారు వినియుండలేదు కాఁబోలును. మారాజునకుఁ గుమారుఁడు కలఁడు. ఈధనసంచయము లాకుమారుని భాగ్యాభ్యుదయములే.

మంత్రి—(ఆశ్చర్యముతో) ఏమి? కుమారుఁడు కలఁడా? ఎంతవయసువాఁడుం డెనుఁగనే.

సుమం—పదునెనిమిదేండ్ల ప్రాయము కలవాఁడు.

మంత్రి—పదునెనిమిదేండ్లవాఁడా? పదునైదేండ్లక్రిందట నేను చందనావతికిఁ బోయినపుడు మీరాజు సంతానహీనతకు నాకడ బిట్టువగచెను. ఇంతలో మీరాజ్ఞి మేధావినీదేవి గొడ్డువీఁగి యొక్కసారి నాలుగేండ్లకొడుకుఁ గనెనా యేమి?

సుమం—దేవా! అతఁడు కన్నకుమారుఁడు కాఁడు.

మంత్రి—ఔరసుఁడు కానిచో దత్తుఁడా? మీరాజు జ్ఞాతులలో దత్తుఁడు కాఁదగిన కఱ్ఱుఁడు లేఁడే?

సుమం—దత్తుఁడును గాఁడు.

మంత్రి—(నిందాగర్భముగా) అట్లయిన మీ రాకుమారరత్న మేఖనిలో నుద్భవించెను? ఆకాశమునుండి యూడిపడెనా? భూమిలో మొలచెనా?

సుమం—అర్ధరాత్రమున నరణ్యములో దొరకెను.

మంత్రి—(సాక్షేపముగా) అర్ధరాత్రిమున, నరణ్యమున దొరకెనా? పాపము, మీకొఱకై బాలుఁ డడవిలోఁ గనిపెట్టుకొని యుండెఁ గాఁబోలు. ఇది నమ్మఁదగినదనే చెప్పుచుంటివా?

సుమం—దేవా! ఇది సత్యము. మీ సమక్షమున వేఱు మనవిఁ జేయఁగలనా?

మంత్రి—సత్యమే? సత్యమే? బాలుఁడు దొరకి యెంతకాల మయినది?

సుమం—పదునాలుగేండ్లయినది.

మంత్రి—(తనలో) వెనుక నే నాశిశువుఁ జంపఁబంపి యెంతకాలమయి యుండునో? పదునాలుగేండ్లు కాలేదా? వాఁడు వీఁడయి యుండునా?

ఆ. వె. నమ్మఁదగినబంట్లు నాపంపు ఘాతుకుల
చెల్లియుండు నాఁటి చెనఁటికుఱ్ఱ
డైన నేమొకాని యనుమాన ముదయించె
నిర్మల మ్మగునాదు నెమ్మనమున. 15

(ప్రకాశముగా) సుమంతా! దొరకినప్పుడు బాలుఁ డెంతవయసువాఁడు?

సుమం—నాలుగైదేండ్లవాఁడు.

మంత్రి—(తనలో) అప్పటికే వాఁడుఁగూడ నంత వయసువాఁడే కాఁడా? మనసా! కలవరము నొందకుము. కథలఁ బోలినకథలు లోకమున నుండకపోవు. (ప్రకాశముగా) సుమంతా! అప్పుడు బాలుఁ డేస్థితిలో నుండెను? మీ కెట్లు దొరకెను?

మంత్రి—యువరాజు పరిపాలనమున దేశ మెట్లున్నది?

సుమం—ఇట్లున్నది—

ఆ. వె. నడుచు ధర్మ మిప్పుడు నాల్గుపాదములను
గాటకములు పూర్వకాల కథలు
జారచోర భీతి శబ్దావశేషంబు
స్వప్నగతము లీతిబాధ లచట. 17

దేవా! నేనేల? చంద్రహాసుఁడా జనులచే నిట్లు పరిగణింపఁ బడుచున్నాఁడు.

తే. గీ. ఆలమునందు నలిగిన శూలపాణి
సాధురక్షణ కొండిన చక్రపాణి
వైభవమ్మున మానవ వజ్రపాణి
ధర్మపరత మధ్యమలోక దండపాణి. 18

మంత్రి—(తనలో) అబ్బా! ఈ స్తోత్రము వినఁజాలకున్నాఁడను. ఈతని పలుకులు సూదులట్లు నాకుఁ గర్ణకఠోరము లగుచున్నవి. ఇతని నింకఁ బంపివేయవలయును (అని ప్రకాశముగా) సుమంతా! చంద్రహాసుని వార్తను నేను [illegible] ననుము. తన పుత్రిని ప్రదానము చేయుటకు నేనును మహానందభరితుఁడ నైతి ననుము. అచిరకాలమున వచ్చి తన యానందమును సగపాలు పంచుకొని యనుభవింతు ననుము. నీ వింకఁ జనుము.

సుమం—మహాప్రసాదము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—(తనలో) ఏమీ? ఆకుమారుఁడు దుర్గాదేవియున నరణ్యమున రక్షించెనా? నాలుగైదేండ్లవయసా? ఆఱువ్రేలు నతనికుండదేనా? కథలందుఁ బోలిన కథలు లోకమున నుండవచ్చును గాని యిన్ని సామాన్యలక్షణము లుండుట యరిది. నేను తోటి ఘాతుకుల చేతి కిచ్చి చంపఁబంపిన డింభకుఁడు నాలుగైదేండ్ల యీడువాఁడగుట చేతను, నృశంసకులు వాని సద్గాత్రమున నరణ్యమునకుఁ గొంపోవుటచేతను, బాలకుఁ డెగటార్చినందున కానవాలుగ ఘాతుకులు లోకచిన్నవ్రేలు దెచ్చి నాకుఁ జూపుటచేతను, ఖండితాంగుళి కానఁబడె తే దని సుమంతుఁడు పలుకుటచేతను, బుద్ధిని సూక్ష్మతీక్ష విలాసంబులు పరికించి నాజ్యోతిషికు లెట్లు పలికిరో చంద్రహాసుని కాంతిలక్షణములు నట్లే నచియించుటచేతను, సర్వవిధముల వాఁడే వీఁడయి యుండవచ్చునని తోఁచుచున్నది. నీతిబాహ్యులగు నంతకులచేత నేను వంచింపఁబడి యుండవచ్చును.

తే. గీ. నాలుగు వరాల లంచంబు నాకడఁ దిని
వేయి పసిబిడ్డ కుత్తుకఁ గోయఁదలఁచు

హేమ—సత్వరము ప్రవేశపెట్టుము.

కంచు—చిత్తము. (అని నిష్క్రమింప మంత్రి ప్రవేశించును.)

మంత్రి—జయము జయము మహారాజా! (అని [illegible] కూర్చుండును.)

హేమ—భాగురాయణా! ఆహితాగ్ని యగు నీ మహాత్ముఁడు కాశ్మీరరాజ పురోహితుఁడు దేవశర్మ. అన్నపుని పనుపున సింహదేవునకు మన చంద్రహాసమాలిని నిమ్మని యడుగ వచ్చె.

మంత్రి—(తనలో) ఆహా! మరల నొక గ్రహమని వచ్చినదిగదా. వచ్చిన నేమి? ఈ యంతరాయము లెల్ల నా బుద్ధిసువర్ణము మేలిమిం జూపఁదగిన గీటుఱాళ్లు. (ప్రకాశముగా) కుంతల కాశ్మీర కుటుంబముల కలయిక నాకుఁ బరమసంతోషము. ఉభయుల జాతకములఁ జూచి ముహూర్త మేర్పఱిచి వెనుకనుండి పంపవచ్చును.

హేమ—అవును. బ్రాహ్మణోత్తమా! సింహదేవుని జాతకము, వాని చిత్రపటము నాకిచ్చి మీరు విజయము చేయుఁడు.

దేవ—చిత్తము. ఇదె జాతకము. ఇదె చిత్రపటము. [illegible] (అని నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—[illegible] పిశాచమును వెడలనడిపితిని. (ప్రకాశముగా) [illegible]

హేమ—జ్యోతిషమునందు నీకువలె నాకుఁ బ్రవేశము లేదు. ఇది నీవు చూడఁదగినది. (అని యిచ్చును.)

మంత్రి—(చూచుట నభినయించి) మహారాజా! మన [illegible] కదృష్టవంతులము. జాతకముం జూడక వివాహము నిశ్చయించినచోఁ జాల ప్రమాదము సంభవించి యుండును.

హేమ—(ఆశ్చర్యముతో) ఏమి ప్రమాదము జరిగియుండును? జాతక మెట్లున్నది?

మంత్రి—ఏమని మనవి చేయుదును? చెప్ప నోరు రాకున్నది. అయినను రాజభక్తి యీ రహస్యమును నా హృదయమున దాఁగనీయదు. సింహదేవుని జాతకమునఁ దాయుస్థానమునఁ గ్రూరగ్రహ మున్నది. అందుచే నతఁ డల్పాయుష్మంతుఁడు.

హేమ—భాగురాయణా! చాలు. కాశ్మీరరాజసంబంధము చాలు. ఇఁక ప్రసంగము తలపెట్టకుము.

తే. గీ. దెసలు వెలిఁగింపఁ గల మహా తేజమున్న
[illegible] మహా ప్రతాపమున్న

నా యీవు కొ[illegible]నేని నతఁడు వోవుఁ
జమురు లేని [illegible] సత్యాగంబ. 22

మంత్రి—(తనలో) జ్యోతిశ్శాస్త్రమా! నీ వడ్డుపడి నా యాపద నిప్పటికి గడవం బెట్టితివి. (ప్రకాశముగా) దేవా! ఈ ముదిమిలో బాలికావివాహవిషయికమైన చింత మీరు మనంబున నుంచుకొనరాదు. ఎట్టియల్లుఁడు కావలయునో తెలిపి సంబంధ నిశ్చయభారము నా తలపై మోపుఁడు.

రాజు—అమాత్యా! ఇదిగోఁ జెప్పుచున్నాఁడ.

ఉ. అల్లునిఁ దెమ్ము నా కొకని యందము నెంచినఁ జందమామ మే
నల్లుని నేలువాని, బల మారసిచూడ విరోహరాజు నె
ద్దల్లునిఁబోలు వానిని, మహారసికత్వమునందుఁ గంసు నీ
కన్నల్లుని మీఱువాని, సిరి కంబుధి యల్లునిఁ గేరువానినిన్. 23

మంత్రి—చిత్రము. (అని తనలో) ఈ లక్షణములన్నియుం దాదాపుగ మా మదనునియందుఁ గన్పట్టుచున్నవి గదా.

రాజు—ఇది నీ వతిశీఘ్రమునఁ జేయవలయు. ఇట్లు నేను వేగిరపడుటకు రెండు కారణములు కలవు. బాలిక వివాహయోగ్యమగు వయసుం బ్రాపించినది. వసుంధరాపరిపాలనక్లేశ మీముదిమిని మునుపటికన్న దుస్సహముగ నున్నది. ఇది నీ వెఱుంగనిది కాదు.

చ. మిడుతలదండు వచ్చిపడి మేయునొ పంటల, శత్రుసైన్యముల్
విడిసెదమనో జగీప, నతివృష్టులు ముంచునొ నేల, క్షామ మే
పొడిదముగాఁ బ్రజం దుడిచిపెట్టునొ యంచుఁ గిరీటధారణం
బెడపక నేయు మూర్ధము సుఖింపక వ్యాకుల భాజనంబగున్ 24

అటులున్నను,

చ. చిరముగ నేలినాఁడ మహి సింగపుగద్దియ నెక్కి ధారుణీ
శ్వరులరిగాఁపులై కొలువ, సౌఖ్యములన్నియుఁ బొందినాఁడ, నీ
చరమదశ న్దపోవనులఁ జక్రిపదాంబుజచింతనంబునన్
జరుపఁ దలంచినాఁడ దివసంబుల నల్లునికిచ్చి రాజ్యమున్. 25

అందుచేతఁ బుత్రసంతానహీనుఁడనగు నాకు హిమవంతునకుఁ జంద్రమౌళియు, క్షీరసాగరునకుఁ బురుషోత్తముండును లభియించినట్లు యుల్లటికముండు నల్లుఁడు కావలయు. పుత్రసంతానవంతు లెంతయదృష్టవంతులో కదా.

తే. గీ. ప్రాణపదమైన నక్కూటా! యూఁడి
పిలిచి యొక్కయ్యచేతిలోఁ బెట్టిరి
యొరవునామాట్లచేత నా కిపుడు మఁ
గానవయ్యెడుఁ గొడుకులులేని వెలితి 26

మంత్రి—దేవా! చంపకమాలికకి మదనునిఁ దెచ్చి కూర్చుచున్నఁ గూర్చి నీమనోరథసిద్ధిఁ జేయుడు. అనపత్యులు విచారింపవలయును గాని యేదో సంతానమున్నవారు పుత్రులులేరని చింతించుట యుచితము కాదు. మీకుఁ గొడుకైనను, కూఁతురైనను జంపకమాలినియే. అదియునుగాక కడుపునంబుట్టిన బిడ్డలు స్త్రీలైనఁ బురుషులైన సమానులే.

తే. గీ. కూఁతు రుదయించి తెచ్చెడు కొఱఁత యేమి
కొడుకు జనియింపఁ గల్గెడు గొప్ప యేమి
యుభయులుం గన్నబిడ్డలే, యుదధిఁ బుట్టు
మౌక్తికము, వజ్రము సమూల్యమణులె కావె. 27

హేమ—పుత్రులు వంశపారంపర్యమును నిల్పి నరకత్రాతలై సద్గతులు గల్గింతురు.

మంత్రి—అవివయముల దౌహిత్రులు పుత్రతుల్యులు. (తనలో) రాజపుత్రికా వివాహప్రసంగమున శ్లేషోక్తిగ మా మదనునిమాట సూచించితినిగదా. వార్ధకమునందే మర్త్యులమయిన యీయనమనస్సును క్రమమున మదనున కనుకూలముగాఁ ద్రిప్పెద.

[ఒక కంచుకి ప్రవేశించును.]

కంచు—(రాజుతో) దేవా!, సుమంతుఁడు చందనావతికిఁ దిరిగిపోవుట కనుజ్ఞ వేఁడుచున్నాఁడు.

హేమ—పోవచ్చును. అంపిన కానుకల నానందముతో నందుకొంటినని పులిందునితోఁ జెప్పుమనుము.

కంచు—చిత్తము. (అని నిష్క్రమించును.)

మంత్రి—(తనలో) పులిందునిప్రసంగ మెత్తి, నాసంకల్పము కొనసాగించుట కిదియే సమయము. (అని ప్రకాశముగా) దేవా! చిత్తగించితిరిగదా, పులిందుఁడు పంపిన వెలలేని కానుకలను.

హేమ—కానుకలకేమి కాని, మన్నెవారలం గెలిచి యూతఁడు నాకుపకారముఁ జేసెను.

మంత్రి—ఈ విజయమును, మితిలేని యానందమునుఁ జూడ [illegible]

లము, పుళిందుఁడే స్వార్థపరుఁడుగా మాఱినట్లు కనఁబడుచున్నది. మీకేగాక, నాకుఁ గూడఁ గొన్ని యమూల్యాభరణము లుపాయనముగఁ బంపెను. మనకంపిన ధనసంచయంబుతో యింత మితిమీఱియుండఁ దాను దాఁచుకొనిన యర్థరాసు లెంతగానుండునో, ఇంతకు నూఱుమడుంగులైన నుండవచ్చు. పుళిందుఁ డేమోకాని, మన కీయవలసిన కప్పమే సరిగా నీయలేక యప్పులు జేసి, యెడనెడ నంతఃపురాంగనల నగలు కుదువఁ బెట్టి నానాబాధలు పడుచుండువాఁడు. ఇప్పుడు నోరులేని మన్నెమూఁకల దోఁచుకొని తేరగాఁదెచ్చిన సొమ్మగుటం జేసి కావళ్లతో దేవరవారికిని, మీబంటునకు నాకును గట్నములఁ బంపె. విక్రమము పేరు పెట్టి సలిపిన యీ బందిపోటునకు దేవరవారు తన్ను దండింతురేను భయమున మిమ్ములను, నన్నును ప్రసన్నులఁ జేసికొనుటకై కన్ను చెదరిపోవునట్లు ధనరాసు లంపెను. ఇవి మనకన్నులఁ గప్పుటకిచ్చిన లంచములుగాని కానుకలు కావని నేఁ దలంచెద. అట్లైన కాకున్న,

శా. నానాఁటం న్నృపు లప్పనంబులనుప న్నాకంటు నేఁ జూచె నే
యేనాఁడైన నృపుం డెవండయిన ము న్నీరీతిఁ గావళ్లతో
నానారత్నము లంపఁగాఁ గలిగెనే, నా మా టటుండంగనిం
డేనాఁడైనను గంటిరే కనులతో నిన్నింత మీ రేనియున్. 28

ఆనృపాలుని దివాణంబున మాణిక్యంబులు మసిబొగ్గులట్లు, రవ్వలు గవ్వలట్లు, కెంపులు పెంకులట్లు వ్యవహరింపఁ బడుచున్నవని తోఁచుచున్నది.

తే. గీ. ఎన్ని ప్రాణము ల్దీసెనో, యెన్ని యిండ్లు
కూలఁ ద్రోసెనో, యెన్నాళ్ళ కొల్లఁగొనెనో
ఎన్ని వంశము ల్మాపెనో యీతఁ డకట !
ఎన్ని సేయక యీ సిరి యెట్లు గాంచు. 29

పాప మనాగరికులైన యీ కొండకాఁపు లెంత చిత్తక్షోభము నొందిరో, దిక్కుమాలి యెంతవిలపించిరో; యెవ్వఁడెఱుఁగును. స్వార్థపరులయిన దేవరవా రుపేక్షింప వారు పిల్లికిం జిక్కినచిలుకలభాతి పుళిందుని దురాశాత్మునకుఁ గబళంబులైరి. అన్యాయార్జితములయిన యీధనములను నానందముతో నందుకొంటినని పుళిందునకు సుమంతుని ముఖమున మీరంపిన సందేశము నాకెంతయుఁ గష్టముగ నున్నది. ఇందులకు దేవర నన్ను క్షమించుఁగాక.

తే. గీ. మనకు నంపిన యీ మణుల్ మణులు గావు
బోయదొరల క్రొన్నెత్తురుబొట్లు గాని

నమ్రతనుఁ బంపు బంగారు నాణెములును
నాణెములు గావు ప్రజల ప్రాణములు గాని. 30

మఱియు,

క. ఈ ధనములు నరకమునకు
సాధనములు కైటభారి చరణాబ్జయుగా
రాధనములు గావించెదు
సాధులు మనబోంట్లు ముట్టఁజన దీధనముల్. 31

కావునఁ బుళిందుఁడు సుమంతునిచేతఁ బంపిన మణిహారాద్యుపాయనంబుల నేను దాల్పను. దేవరవారి ధనాగారమునఁ జేర్చెద. పాపకర్మార్జితంబులగు విత్తములు విషంబులుంబోలె ననుభోక్తలం జెఱుచు.

హేమ—భాగురాయణా! పుళిందరాజు మన్నెదొరలయెడ నెఱపిన శౌర్యమధర్మమూలకమైనదా? అది మన కుపకారము కాదా?

మంత్రి—దేవా! అది శౌర్యమనుట శూరుల నవమానించుట. చూడుఁడు,

తే. గీ. చేవగలదని గర్వించి లావుదేరి
యవనిపతులను గిల్లి కయ్యములు దెచ్చి
పోరి, తద్రాజ్యసంపద లప్పడికి కొనుట
చౌర్యమగుఁ గ్రౌర్యమగుఁ గాని శౌర్యమగునె. 32

హేమ—అట్లయినఁ జంద్రదత్తుఁడు చేసినదోసముల నిరూపింపుము.

మంత్రి—అవధరింతురుగాక! సార్వభౌములగు దేవరవారి యాజ్ఞ బడయక నామీ కరిగాఁపగు తాను, తన వలె నరిగాఁపులగు మన్నెదొరలను నిష్కారణంబుగ, నిర్దయంబుగ దండించి వారిదేశములు కొల్లఁగొనుట మీయనుజ్ఞఁ గొనక పుత్రస్వీకారముఁ జేసికొనుట. చంద్రహాసుఁడను కొడుకు నీతఁడు పెంచుకొని పదునాలుగేండ్లయిన నామాట యింతవఱకు మీచెవిం బడినదా? అతఁ డెంతకైన సాహసికుఁడే. కానిచో నట్లూరకుండునా?

శా. ప్రీతి న్నాకెఱిఁగింపఁడయ్యె సరె నాపేరేమి యూరేమి యా
న్మాతృస్థానము మీ దివాణముగదా మన్నించి తాఁ జెప్పనే,
మీతో నేమియు, నేల చెప్పఁ? కడిమి న్మిన్నంటి వాఁడుండఁగా
నీ తాటోటులు భక్తిలక్షణములా నే మీయెడ న్భావనా! 33

వచ్చినంతకలగన్నప్పుడు పెండలకిడ మేలుకొనవలయు నన్నట్లు పుళిందుని విషయమున మన మేమఱి యుండరాదు. ఏమనిన్న

తే. గీ. నేఁడు సామంతనృపులను నిగ్రహించ
నెల్లి మనమీఁదికే యాతఁ డెత్తివచ్చుఁ
గొట్టకొన మాఱుఁగాల్చిన కొఱవితునుక
క్రమముగా మండి నడికొప్పుఁ గాల్పకున్నె. 34

త్రాచుఁబాముపిల్లను, రాచబిడ్డనుఁ దల యెత్తనీయరాదు. నాపలుకులు కొండెములు కావుసుఁడీ. ఏలయన, పుళిందుఁడు నాకు మిత్రుఁడు కాని శత్రుఁడు కాఁడు. మిత్రుని తలపై నేరములు మోపుట పాడియగునా యందురేమో, రాజభక్తిముందట మైత్రి నిలువనేరదుగదా. రాజభక్తిలేని మనసు రాయి. రాజభక్తిశూన్యుఁడగు మనుష్యుఁడు రాక్షసుఁడు. రాజు ధాత్రి నవతరించిన భగవంతుఁడు. రాజు సాకారమైన ధర్మము. ఆ రాజులలో మీరు—మీ యెదుట స్తోత్రము చేయఁగూడదు కాని—రఘు, దిలీప రంతిదేవ, హరిశ్చంద్రప్రముఖ పూర్వరాజర్షుల ననుకరించి యేలెడు ధర్మమూర్తులు. ఎవఁడు కాని మీయెడలఁ గృతఘ్నుఁడగుట నరకమునకు మెట్లుగట్టుట. వేయేల? నా నిశ్చయము వినుఁడు.

శా. ఏద్రోహంబయినన్ సహింపఁదగుఁగా నెంతే కృపాదృష్టి రా
జద్రోహంబును మాత్ర మెన్నఁడును నే సైరింపఁగాఁ జాల, స్వా
మిద్రోహంబునుఁ బోలు పాతకము భూమింగాన, మే తాదృశుల్
క్షుద్రుల్, మైత్రికి భాషణంబునకు యోగ్యుల్గారు మాబోంట్లకున్. 35

హేమ—నీయుక్తులవలన నతఁడపరాధియని తోఁచెడిని. కర్తవ్య ముపదేశింపుము.

మంత్రి—మీ సెలవగునేని నేను జందనావతికిఁ బోయి స్థితిగతుల స్వయముగఁ జూచి కర్తవ్యము నివేదించెద.

హేమ—సరే. అట్లచేయుము. నీవు వచ్చునంతవఱకు మాకడ మదనునిఁ గార్యనిర్వాహమునకు నిల్పుము. (అని రాజు నిష్క్రమించును.)

మంత్రి—(తనలో) అమ్మయ్య! ఇప్పటికొక ప్రయత్నమునఁ గృతకృత్యుఁడనైతిని.

తే. గీ. మాయమార్గంబు లనియెడు మళ్ళలోనఁ
బురుషకారబీజంబులఁ బోసినాఁడ
నో యదృష్టమేఘమ! యిట్టె యుఱిమి చనక
కురియఁగదె సహాయవృష్టిఁ గోర్కె పండ. 35

పరమేశ్వర ప్రభావమే యితివృత్తముగాఁగల జగన్నాటకమునందు నేనుఁ గథానాయకుఁడుగా వ్రాయఁదలఁచిన యంతర్నాటకమునందుఁ బ్రథమాంకము ముగిసినది. ఇంక ద్వితీయాంకమునందుఁ బ్రవేశించుటకు నేను నిష్క్రమింపవచ్చును.

——— (అని నిష్క్రమించుచున్నాఁడు.)

వద్దకు నన్నుఁ దీసికొనిపోయి నాకుఁగల పీడలఁ దొలఁగింపఁజాలిన పుణ్యాత్ముఁ డెవ్వఁ డయినఁ గలఁడా? దీనికై నే నెవ్వరి నాశ్రయింతు. (అని నలుదెసలఁ జూచి) ఇదిగో యీ మందరుఁడు కొండముచ్చులాగున నిచ్చటనే కూర్చున్నాఁడు. ఈతని నాలోచన నడిగెద. (అని వానికడకుఁ బోవుచున్నాఁడు.)

మంద—శౌనకా! నీవేదో యాలోచించుచున్నట్లున్నావే?

శౌన—మందరా! నాతండ్రీ! నాగ్రహచారస్థితి బొత్తిగ బాగుండలేదు. ఉదయమున లేచినది మొదలు రాత్రి పండుకొనువఱకు యజమానునిచేతఁ దల వాఁచునట్లు చీవాట్లేకద. మాటిమాటికిఁ బోగపాట్లేకద. ప్రతినిముసము దౌడ పగులునట్లు చెంపకాయలేకద. అనుక్షణము తల చిల్లిపడునట్లు మొట్టికాయలేకద. ఈ యుపద్రవములు మాన్పుకొనుటకు గట్టి గ్రహశాంతిఁ జేయవలయును. అది చేయింపఁగల గొప్ప జోస్యు నెవనినైన నాకుఁ జూపఁగలవా? నీ విమ్మంతటి బ్రహ్మోపకారము చేసి యీ యనకు సమర్పించుకొనియెద.

మంద—ఎవరో జోస్యుఁ డెందుకు? నేను జ్యోతిశ్శాస్త్రములోఁ గొంచెము వేలు పెట్టినవాఁడనే. నీకుఁ గావలసినది నేనే చెప్పఁగలను. ఏ మడిగెదవో యడుగుము.

శౌన—ఇదిగో నడుగుచున్నాఁడను. నాజాతకమునుఁ జూచి, రోగములు, గ్రహచారములు, రాసులు, దశలు, ఫలములు, గ్రహశాంతివిధానములుఁ జెప్పవలయును.

మంద—జాతకము చూడనక్కఱలేదు. నీజన్మనక్షత్రముఁ జెప్పినం జాలును. దానిఁబట్టియే చెప్పవచ్చును.

శౌన—నాజన్మనక్షత్రము ధనిష్ఠ.

మంద—ఓహో! ధనిష్ఠా పంచకములోఁ బుట్టితివా? సరే. జాతకప్రభావము వినుము. నీకు శాశ్వతమైన రోగము మంత్రిగారి నియోగము. తప్పుచేసినప్పుడు దండప్రయోగము. జీతము విఱుగఁగోయుటచేత నప్పుడప్పుడు ధనవియోగము. తక్కిన యోగము లవయోగములే. నీగ్రహములు మంత్రిగారి యాగ్రహములు, నిగ్రహములు. అనుగ్రహములు సున్న. నీ రాశి పూటపూటకుఁ బెద్ద కుంభరాశి. దానితోఁ గలియుచుగ మీనరాశి చేరియుండును. దశలు దుర్దశలు. అవస్థలు దురవస్థలు. ఫలములు నిష్ఫలములు. నీజాతకము [illegible]దలి కోణములు చీఁకటి కోణములు. నీ జాతకచక్రము మనసులో వేసికొనిచూడఁగా బండిచక్రమువలె నున్నది.

శౌన—ఔరా! ఎంత సరిగాఁ జెప్పితివిరా. ప్రస్తుతము నా జాతకము నీవు చెప్పినట్లే మిక్కిలి పాడుగా నున్నది. జ్యోతిశ్శాస్త్రములో నీవెంత గొప్పవాఁడవురా! ఇంతవాఁడవని యెన్నఁడెఱుఁగనే. ఇదివఱకెందఱో జోస్యులు నాగ్రహచారములఁ జెప్పిరికాని యింతచక్కగాఁ జెప్పినవారులేరు. ఒక జోస్యుఁడు నాకు శని చాలఁడన్నాఁడు. ఏలినాటిశని యఁట. ఇప్పుడు నాకు శని యెన్నింట నున్నాఁడు?

మంద—ఎన్నింట నననేల? అన్నింట నున్నాఁడు. ఆ జోస్యుఁడు నీకిప్పుడున్న శని చాలఁడన్నాఁడా? ఇఁక నెక్కువ శని కావలయునా? నీకన్న నెవ్వరికెక్కువగా నున్నాఁడు శని? నీది యేలినాటిశని కాదు. ఆలినోటిశని; బిడ్డలనోటిశని. ఏమన, నింటనున్న బియ్యము, కందులు మొదలగునవి కన్నుఁగన నీయాలుబిడ్డలు తినకుండ గ్రహచారములు చెప్పు టక్కరిబ్రాహ్మణుని యొడిలోఁ బోయుచుందువు.

శౌన—బ్రాహ్మణుల కిచ్చినదానములు వ్యర్థముగాఁబోవు. ఎప్పటికైన గ్రహములు చక్కఁబడును. నీ ప్రల్లదపుమాటలకేమిగాని, నాజాతకము నాలుగైదేండ్లలో యోగించుననియు, నాకు వాహనప్రాప్తి గలుగుననియు నొకజోస్యుఁడు చెప్పినాఁడు. అది నిజమేమో చూడు.

మంద—అట్లుచెప్పిన జోస్యునకు నీ వేమిచ్చితివి?

శౌన—నా వెండికడియము లమ్మి యొకవరహా సొమ్మయ్యచేతిలోఁ బెట్టితిని.

మంద—అయ్యో! నిష్కారణముగా సొమ్ము పాడుచేసితివి. సొమ్ము పుచ్చుకొనకుండ నీ మాట నేనే చెప్పియుందును. ఏది యబద్ధమైనఁగావచ్చునుగాని యీమాట యబద్ధము కాదు. నీకిప్పు డిఱువదియైదేండ్లున్నవి కదా. ఇఁక నాలుగైదేండ్లలో నీకు వాహనయోగము పట్టవచ్చును. ఏకాకట్లపల్లకిలో నిన్నుఁ బండుకొనఁబెట్టి మేము మందఱము "హోంహోం, హోంహోం" అని మోసికొనిపోవుదుము. అప్పుడీ యూరికి దక్షిణమున రెండుపుట్లకఱ్ఱతో నొక్క వెలుఁగు వెలుఁగుదువు. నీ కాయోగము పట్టినా యిఁక మంత్రిగారికి నీదర్శనమేకాదు. ఒకరికొలువు నీవు చేయనక్కఱలేదు.

శౌన—చదువుకొన్న వాళ్ళకున్న తెగులేయిది. సరిగాఁ జెప్పక యడ్డదిడ్డముగాను వేళాకోళముగాను మాటలాడుదురు. నీ యెగతాళి కేమకట్టిపెట్టి నాకు శని యెప్పుడు విడుగడయయిపోవునో చెప్పు.

మంద—నీ కొంపకు నీవే శని. నీ శని నీతోనే పోవును.

శౌన—ఛీ! ఇఁక నీతో మాటలాడఁగూడదు. మొదట తిన్నగఁ జెప్పితివి కాని యిప్పు డెగతాళి మొదలుపెట్టితివి. (అని పోఁబోవును.)

మంద—(చేయిపట్టుకొని యాఁపి) తాతా! నే నొక్కమాట చెప్పెద వినుము.

స్వప్న, శకున, సాముద్రిక, జ్యోతిశ్శాస్త్రములు బూటకములు. బ్రాహ్మణులకు బ్రతుకఁ దెరువులు. బాపనవాండ్రీశాస్త్రముల యాధారమున మూర్ఖుల బెల్లించుకొని డబ్బులాగుచుందురు. వసిష్ఠునికన్న గొప్పజోస్యుఁడెవఁడు? శ్రీరామపట్టాభిషేకమున కాయన పెట్టిన ముహూర్త మెంతచక్కఁగా యోగించినదో యెఱుఁగవా? ఇట్టివనేకములు కలవు. కావున జోస్యులమాటనమ్మి చెడక, యున్నడబ్బు నీయాలుబిడ్డలకే పెట్టికొనుము. నీ పాగపాటులకు నీ తెలివితక్కువయే కారణముకాని గ్రహచారము కాదు. అప్పుడప్పుడు మిడతంభొట్లుశకునములవలె జోస్యులపలుకులు కొన్ని చెప్పినట్లు జరుగును. వానిం బట్టి మనము మోసపోఁగూడదు.

శౌన—ఓరినాస్తికుఁడా! నీ చదువు తగులఁబెట్ట. ఇదియా నీ చదువు? రాజుగారికి, మంత్రిగారికి జ్యోతిశ్శాస్త్రమం దెంతో నమ్మకము. వారికంటెను గొప్పవాఁడవా? అందుకే మిడిమిడిజ్ఞానము పనికిరాదందురు. బ్రాహ్మణులమాట లబద్ధములైనచో వారు చెప్పినట్లు గ్రహణము లేలపట్టుచున్నవి? తెలియనివాఁడవు తెలియనట్లుండక యీ ప్రగల్భము లెందుకురా? పార్వతీశాపమున నెప్పుడైన నొకటిరెండుసంగతులు, చెప్పినట్లు జరగకపోవచ్చునుగాని శాస్త్రమే యబద్ధమా? ఛీ! పశువా! నీ మొగము చూడఁగూడదు. శాస్త్రమును, బ్రాహ్మణులను దూషించినందుకు నీపాపము నిన్నే కొట్టును. (అని కోపగించి పోవుచున్నాఁడు.)

మంద—(తనలో) ఆహాహా! మూర్ఖులఁ బ్రబోధింపఁ బ్రయత్నించుట యిసుక జక్కెరఁజేయఁ బ్రయత్నించుట. మంత్రిగారికి జ్యోతిశ్శాస్త్రమునందు నమ్మక మెంతు. నే నిట్లుపలికితినని యీనిర్భాగ్యుఁ డాయనతోఁ జెప్పెనా, నా కూడు పడిపోవును. నే నెదుట నున్నప్పుడు శౌనకుఁడు సాహసించి మంత్రిగారితో నామీఁదఁ గొండెములు చెప్పలేఁడు. అందుచేత నే నిప్పుడేపోయి కాంచనమాలం బిలిచి, మంత్రిసన్నిధినుండెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ఇదివిష్కంభము.

---

రంగము:—మంత్రిమందిరములో నొకగది.

---

[అప్పుడు మంత్రి ప్రవేశించుచున్నాఁడు]

మంత్రి—(తనలో) ఆహాహా! అనృతమహత్త్వ మెవ్వఁడు కొనియాడఁగలఁడు.

చ. అనితరలంఘ్యమైన విపదంబుధి దాఁటఁగ నావ యేది, భీ
జనమునందు వజ్రకవచం బది, మిత్రమ దేది పేదకున్

ధనికిఁ, గృపాణికన్న నిశితంబగు నాయుధమేది శత్రుసా
ధనముల యందు, నట్టియనృతంబునకు న్నదివేల దండముల్.

ఏదానికి మంత్రులు మొదలగు లౌకికుల మనస్సులు వాసభవనంబులో, యేదానికి వణిజుల నాలుకలు స్వేచ్ఛగా గమనాగమనముల కనుకూలంబగు రాచబాటలో, యెయ్యది రాజులకు బలంబులనెల్ల మించిన మూలబలంబో, యెయ్యది రాజనీతికిఁ బ్రాణమో, యెయ్యది ఖడ్గాది సాధనంబులుంబలెను, నారాయణాది మహాస్త్రంబులుంబలెను స్థలకాల పరిజ్ఞానముఁ గలిగి ప్రయోగించువాని కౌశలంబునఁబట్టి యమోఘమై విజయంబు సంఘటించునో, యేదాని ప్రయోగవిధానంబునం గుశలతలేమి హరిశ్చంద్రునకుఁ జండాలసేవయు, బలికిఁ ద్రివిష్టప సామ్రాజ్యభ్రష్టతయు, దశరథున కకాలమరణంబును సంభవించెనో, యెద్దానియందుఁ బ్రయోగ నైపుణ్యము కుదురుటచే యుధిష్ఠిరునకు ద్రోణాచార్య మరణ మూలకంబుగను శ్రీకృష్ణునకు హంస డిచిక వినాశన మూలకంబుగను మనోరథసిద్ధి చేకూరెనో, యట్టి యసత్యము జగద్గేయమై, ఫల ప్రదాయకమైవర్ధిల్లుఁగాక! ఇతరదేవతలుపాసించువారికివరములీయవచ్చు. మానవచ్చు. కానియనృతదేవత సమర్థముగా నుపాసింపఁబడునేని వరము ప్రసాదింపక పోదు. యథావిధిగా సేవింపనేరని వారి నీ దేవత యెదురు తిరిగి, నెత్తియడంచి చెఱుచును. చిన్ననాఁటనుండియు నాకుఁ దోడునీడయై యుండి యిప్పటికిని వశవర్తినియై మెలంగుచుఁ గార్యసిద్ధిఁ జేయుచున్న దీ దేవతయేకదా. నేఁడు నా వాక్కునకు నిలిచి పుళిందునిపైఁ గుంతలేంద్రున కాగ్రహంబుఁ దెప్పించి చందనావతీపుర ప్రయాణమునకు నాకు రాజానుజ్ఞ నిప్పించిన దీ దేవతయేకదా. ఓ జగదుపకారిణి! ఓ జగన్మోహిని! ఓ యాపద్బాంధవి! ఓ విశ్వవ్యాపిని !

చ. మనుజులు సత్యమే యని భ్రమంపడ మోహన మైనమూర్తి దా
ల్చి, నరునినాల్కకు న్వెగటు సేయక ద్రాక్షలువోలెఁ దియ్యనై
ధనములు గూర్తు, సౌఖ్యములఁ దార్తు, విపత్తు హరింప నేర్తు వో
యనృతమ! నీవు చేసెడిసహాయము తల్లియుఁ జేయలేదుఁ గా. 2

నీవు సర్వదా మాకు జయమొసఁగూర్తువుగాక!

[అప్పుడు మందరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మంద—జయము జయము దేవా! దర్శనార్థము దేవమిహిరులవారు వచ్చినారు.

మంత్రి—శీఘ్రముగ వారిం దోడ్కొనిరమ్ము.

మంద—చిత్తము అని పోయి తోడ్కొని వచ్చి) స్వామీ! వీరె వచ్చినారు.

మంత్రి—ఆర్యా! ప్రణామము చేయుచున్నాఁడను. ఈ పీఠ మలంకరింపుఁడు. మంథరా! ద్వారముకడ నుండుము.

మంత్రి—చిత్తము. (అని నిష్క్రమించును)

దేవ—మనోరథసిద్ధిరస్తు! (అని కూర్చుండును)

మంత్రి—ఆర్యా! రెండవజాతక మనుకూలముగఁ గుదిరినదా!

దేవ—ఆహా! నిర్దుష్టముగాఁ గుదిరినది. మీరు సంకల్పసిద్ధులు.

మంత్రి—దైవజ్ఞసార్వభౌమా! ఇది మీ హృదయశుద్ధిగాని నాసంకల్పసిద్ధి కాదు. ఎట్లన జంతుస్వభావవేది భయంకరములగు సింహవ్యాఘ్రాదిక్రూరసత్త్వంబుల మచ్చికఁ జేసి యవి తనచెప్పిన యాట లాడునట్లు, తన నిలిపినచోట నిలుచునట్లు చేయు విధమున మీబోఁటి దైవవిదులు గ్రహములను వశపఱచుకొని యవి మీ నిలిపిన నెలవుల నుండునట్లు, మీ చెప్పిన ఫలము లొసంగునట్లు చేయఁగలరు. మఱియు,

తే. గీ. ఉన్న ఫలములఁ గనిపెట్టి యున్నయట్లు
వ్రాయనేర్చెద రితర దైవజ్ఞులెల్ల
లేనిఫలములు తోఁచిన లీల వ్రాసి
వ్రాసినట్టుల జరపించువారు మీరు. ౩

క్రొత్తజాతకమునుఁ జూడ నామనస్సు తత్తఱపడుచున్నది. ఏదీ యిటు తెండు!

దేవ—ఇదిగో మీ మదనుని నిజమైన జాతకము. అతఁడు శ్రీముఖ సంవత్సరాషాఢ బహుళమం దేకాదశీ సోమవార ముదయమునఁ బునర్వసు నక్షత్ర ద్వితీయ చరణయుక్త కన్యాలగ్నమునం దుదయించెను. ఈ జాతకఫలములు సామాన్యములు.

మంత్రి—ఆ జాతకము నే నెఱుఁగుదును. క్రొత్తజాతకమునుఁ జూడ వలతు.

దేవ—ఇదె మీయాజ్ఞాప్రకారము నేను సృష్టించిన క్రొత్తజాతకము. దీనింబట్టి మదనుని జన్మము శ్రీముఖ సంవత్సర చైత్రబహుళ పంచమీ శుక్రవారము మధ్యాహ్నసమయమందు మృగశిరో నక్షత్ర ద్వితీయచరణయుక్త కర్కాటక లగ్నమందు.

మంత్రి—(తొందరతో) ఫలములు చెప్పుఁడు. ఫలములు చెప్పుఁడు.

దేవ—చెప్పుచున్నాఁడను వినుఁడు. ఈజాతకమునందు నాల్గుగ్రహములుచ్చస్థితి యందున్నవి. కేంద్రాధిపతులకును, కోణాధిపతులకును, బరస్పరసంబంధములున్నవి. ధనరాజ్యాధిపతులకుఁ బరివర్తనమున్నది. ఈఫలములన్నియు మీ రెఱిఁగినవే. ఈ జాతకునకఖండభూమండలాధిపత్యము చేకూఱును. రాజసూయము చేసి సార్వభౌముఁ డగును.

మంత్రి—ధన్యోస్మి! ధన్యోస్మి! ఆర్యా! జాతక మెంత నేర్పుతో మార్చితిరయ్యా!

దేవ—అమాత్యశిరోమణీ! నాకిదియే ప్రథమప్రయత్నము కాదు. నాచేయి జాతకములమార్చుటయం దారితేఱినదే. నాఁడు మీపినతండ్రి, ప్రథమకళత్ర వియోగమైనపు డేఁబది యేండ్లు దాఁటినందునఁ దనకుఁ బడుచుకన్యనిచ్చి యెవ్వరు పెండ్లిచేయరను

భయంబున ముప్పదిరైదేండ్ల వయసుండునట్లు తనజాతకమును మార్పుమని నన్నుఁ బ్రార్థింప నేనవలీలగా నట్లు వ్రాసియిచ్చితిని. ఇప్పుడున్న మీపినతల్లినే వ్రాసిన జాతకమునుఁబట్టి పెండ్లిసేయఁబడినదియే. పాప మాయన వివాహానంతరము కొద్దికాలములో నే స్వర్గస్థుఁడయినను మృతినొందు వఱకు నాయందుఁ బుత్త్రప్రేమ గలిగియుండెను.

మంత్రి—అవును. వినియుంటిని. అందుచేత నే నాతనయుని జాతకము మార్పుమని మిమ్ము బ్రార్థించితిని. మిహిరవంశమునకును మాకుటుంబమునకును సంబంధము నిన్నటిదా! నేఁటిదా? మాపితృపితామహులకు మీ పితృపితామహు లాశ్రితులై, మిత్రులై సర్వకార్యములఁ దోడ్పడుచు వచ్చిరి. ఎంతెంత రహస్యములు మీపెద్దల చెవులం బడినవి కడుపులలో జీర్ణములగుచు వచ్చెనేకాని వెలికివచ్చి యెఱుంగవు. ఆహా! రహస్యములు వెలిపుచ్చుట మీ యింటనొంట లేదుగదా. అట్టిసుగుణ సంపదగల వేదస్వరూపుల కులదీపకులగు మిమ్ము మఱియొక యర్థముఁ బ్రార్థించెద. ఈ వఱకు నాకొనర్చినమేలునకే నా మేనిచర్మము గోసి యిచ్చినను మీఋణము తీఱదు.

దేవ—దేవా! నన్నింత పొగడవలయునా? నన్నుఁ బోషించుభారము మీది. మీపనుపులు శిరసావహించిచేయువిధి నాది.

మంత్రి—ఆర్యా! అవధరింపుఁడు. మన మహారాజుగారికి నిజతపఃఫలమని చెప్పఁదగిన పుత్త్రిక చంపకమాలిని కలదుగదా. జనకుఁ డామెనిమిత్త మనుకూలవరుని వెదకుచు రాజకుమారుల జాతకములన్నియుఁ బరీక్షింప నుద్యుక్తుఁ డయియున్నాఁడు. ఆస్థానదైవజ్ఞులగుటంజేసి, మహారాజుగారు జాతకపరీక్షయందు మిమ్మే నియోగింతురు. ఆప్పుడే సందర్భమునందో యిప్పుడు మీరు నిర్మించిన మా మదనుని క్రొత్తజాతకమును మహారాజుగారికిఁ జూపి గ్రహముల యుచ్చస్థితియు, జాతకప్రభావంబును వేయి నోళ్లం బొగడి, యిన్ని యుత్కృష్టగ్రహములు మఱియొక జాతకమునఁ గూడియుండుట యరిదియని నొక్కి వక్కాణించి, యాయనమనసు విఱిచి యావిభుండు తనముద్దు కూఁతు నా పుత్త్రునకిచ్చునట్లు, రాజ్యంబు నావంశంబున నిలుచునట్లు, మీరువ్రాసిన జాతకము సఫలమగునట్లు, కడుచమత్కృతితో, బుద్ధిసూక్ష్మతతోఁ సమయమెఱిఁగి చేయవలయు. ఈ మహోపకారమునకుఁ బ్రత్యుపకారము చేయఁగలనని గర్వోక్తులు పలుకఁజాలను గాని నా సలుపఁ దలఁచిన దించుక వినుండు. మహారాజుగారిచేత, రాఁబోవు సూర్యగ్రహణమునాఁడు మూడగ్రహారములు పుత్త్రపౌత్రపారంపర్యము జరగునట్లు మీకిప్పించెద. మీయెత్తు ధనము కుప్పవోసి నే నిచ్చెద. ఇఁక గుఱ్ఱములు పల్లకులు కావలసినన్ని కవి. పరోపకారపరాయణులగు మీరు కార్యసంఘటనమునం దెట్టి బహుమానముల కాసపడరని నే నెఱుంగుదును. మాకుటుంబముమీఁదనున్న యభిమానముచేత నే మీరు చేయుదురు. వేయి చెప్పనేల. కార్యభార మిఁక మీదే.

దేవ—అమాత్యమణీ ! నీ సంకల్పము నిశ్చయముగా నెఱవేఱినదని నమ్మెదను. గుణవంతుఁడగు నీ కుమారునిఁగూర్చి యొకఁడు ప్రశంసింప వలయునా?

చ. మదనుఁడు, రూపరేఖ మహిమంబున నాకృతిఁ దాల్చివచ్చు న
మ్మదనుఁడు, తేజమందు నసమానుఁడు, యోగ్యత నద్వితీయుఁడౌఁ,
జనువుల పోఁడిమిం దలఁప క్ష్మాస్థలిపై మగరూపుఁగొన్న శా
రదగద, వాని కేమిటి కొఱంత నృపాలుని యల్లుఁడౌటకున్. 4

మంత్రి—నాకొడుకగుటయే కొఱంత. దూరపుఁగొండలు నునుపన్న ట్లితరరాజ నందనులు యోగ్యులట్లు కనపడుదురు.

దేవ—సరే. నాప్రయత్నమునల న దగ్గఱకొండలే నునుపులగుఁగాక! ఇఁక నాకు సెలవొసంగుఁడు. (అని లేచుచున్నాఁడు)

మంత్రి—చిత్తము. ఇది మీ కార్యము గాని నాకార్యముగాదు.

దేవ—(నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—(తనలో) నేను జందనావతికిఁ బోవులోపలఁ జేయఁదలపెట్టిన కార్యములలో నొకటి నైనదికదా. తక్కినవికూడ నిట్లే నెఱవేఱునా! ఏల నెఱవేఱకుండు. సామ్మకక్కుఱితియున్న మనుష్యులు ప్రపంచమునం దున్నంతకాలము కార్యసాధనము చేతిలోనిదే. పరమనిష్ఠాగరిష్ఠుఁడని, వేదాంతియని పేరువడిన యీబ్రాహ్మణునిచేత నా కార్యమును, మైత్రి, విశ్వాసము మున్నగునవి చేయింపఁగలవో లేవో చెప్పలేను గాని, మూఁడగ్రహారములు తప్పక చేయించితీరునని ధైర్యముతోఁ జెప్పఁగలను. ఏలయన,

తే. గీ. ఆత్మశుద్ధిమహాగ్నికి నంబుదంబు
విమలనియమభూజమునకు వేరుపిత్తు
ఆస యనియెడు బెబ్బులి కామిషంబు
లంచ మది ఘటింపని పనుల్గలుగ వెందు.

అదియునుఁగాక,

క. మంచితనంబులు నీతులు
నంచిత వేదాంతబోధ లాచారంబుల్
కాంచనరాశియు, రూకల
సంచులు కంటఁబడువఱకె జనులకు నిలుచున్

మందరుఁడు—(ప్రవేశించి) దేవా! ఉగ్రసేనులు దయచేసినారు.

మంత్రి—(చూచి) మిత్రమా ! ఉగ్రసేనా ! రమ్ము. మందరా ! ద్వారముకడ నుండుము.

ఉగ్ర—(ప్రవేశించి) అమాత్యా! జయము జయము. నన్నుఁ బిలిపించిన కార్య మెఱుఁగఁ గోరుచున్నాఁడను.

తే. గీ. దండు విడియరు కద శత్రుధరణివిభులు
తిరుగఁ బడలేదు కద ప్రజ లెగువమీఱి
పల్లియల దోఁచుకోనరుగా బందికాండ్రు
మంగళంబేకదా మన మనుజపతికి.

మన్త్రి—ఆహా! మహారాజునకు మంగళమే. ఏతొందఱలు లేవు. సింహమున్న యడవిలో నేనుఁగుల భీతి యుండునా?

సీ. ఎవ్వాని భుజయుగం బీ రాజ్యలక్ష్మికిఁ బెట్టని వజ్రంపుఁ జుట్టుకోట
ఎవనికత్తి యరాతినృపకోటికిని వేల్పుఁ దలిరుఁబోండ్లనుగూర్చు తార్పుఁగత్తె
ఎవనిశంఖధ్వని యెదిరిమూఁకల నెల్ల యముని సన్నిధికి రం డనెడు పిలుపు
ఎవనిసంగరభూమి మృత్యుదేవత వచ్చి విందారగించెడు మందిరంబు
వింటనెవ్వఁ డమ్ములుగూర్చ మింటనపుడె
విరులదండలు గూర్తురు వేల్పుఁజెలులు
హతనృపాలకంఠంబులయం దమర్ప
నట్టి యుగ్రసేనుఁడుగల్గ నలఁతకలదె.

ఎదుట స్తోత్రము సేయఁగూడదు కాని, సత్యమే పలుకవలసివచ్చెనా, కుంతలరాజ్యవ్యాపార ముగ్రసేనుని సాయములేక యొక్కపూట జరగదని నేను ఘంటాపథముగఁ జెప్పఁగలను.

ఉగ్ర—ఈ రాజ్యమను నావను సరిగ నడుపునట్టి చుక్కాని యమాత్యభాగురాయణుఁ డొక్కఁడే. మాదృశులగు నియోగు లలంకారార్థమే.

మంత్రి—నా రాజనీతియు నా మంత్రశక్తియు, నస్తమిత సమస్తవిరోధివరూధినీజాలంబగు నీ కరవాలంబుచాటున నొదిగి యుండవలసినదే. నా మున్నగు నితరలౌకికులు దివాణమునకు జీతములదండుగ నిమిత్తమే. దానికేమి. ప్రస్తుతము వినుము. రాజాజ్ఞను బడసి కార్యాంతరముమీఁద నేను జందవావతికిఁ బోవుచున్నాఁడను. కొంతసైన్యముతో నీవు నన్ను ననుసరించి రావలయును.

ఉగ్ర—దేవర యాజ్ఞాప్రకారము వచ్చువాఁడ.

మంత్రి—ఇది రాజసేవ. నాకు నీవొక్క యుపకారము సేయవలయు.

ఉగ్ర—ఉపకారమా? సూర్యునకు దీపము కావలయునా?

మంత్రి—ఆ యుపమానము సరికాదు. నా పలుకులు వినుము. కలదుగదా నాకు విషయ యను కూఁతురు. వేదాంతవిషయవిచారము చేయుచుండ నాకుఁబుత్రికా జనన మయ్యెనని శుభవార్త తెలియుటంజేసి యామెకు బ్రహ్మవిషయ యను పేరు పెట్టితిని. ఆమె యిప్పుడు సంప్రాప్తయౌవన యైనది. ఎంతెంత చక్కదనంపుటిక్కల నైనఁ జేటిచూడ నొల్లని రాజనందనులు నా బిడ్డ నిమ్మని, నోరుజాచి స్వయముగ నడిగియు, సందేశము మీఁద సందేశమంపియుఁ బ్రార్థించుచున్నారు.

ఉగ్ర—పంపునప్పుడు చిలుకలు మూఁగవా ?

మంత్రి—బాలిక విద్యావతియు, యుక్తవయస్కయు, సదసద్వివేకశాలినియు నగుటంజేసి వరనిర్ణయవిషయమున స్వాతంత్ర్య మామెకే యిచ్చితిని. ఏలయన,

ఉ. ఎవ్వని మెచ్చునో పడఁతి యెవ్వనికిన్ హృదయంబు నిచ్చునో
యవ్వరుఁ గూర్పఁగావలయు నంతియకాని తదన్య గూర్చుచో
నవ్వనజాక్షికి న్పతికి హాయిగఁ గాఁపుర మెప్పుడెప్పుడున్
మవ్వఁపు గమ్మసంపఁగికి మైత్రి ఘటిల్లునె జేఁటితోడుతన్

ఉగ్ర—ఆమె స్వాతంత్ర్యము నుపయోగించుకొని తగు వరు నెన్నుకొనినదా ?

మంత్రి—ఎన్నుకొనినది. కాని, పురుషుఁడు దుర్లభుఁడు.

ఉగ్రి—పురుషుఁడు దుర్లభుఁడా ?

క. ఎవఁడా యదృష్టహీనుం
డెవఁడా బాలిశుఁడు విరసుఁ డెవ్వఁడు, సిరి గాఁ
దివురఁగ మోఁకా లొడ్డెను
నవనీతుఁడు కలఁడె సామె తది నిక్కముగాన్.

పాపము! తే. గీ. చూచి మెఱుఁగఁడు కాఁబోలు సుదతి నెన్నఁ
డతఁడు ; చూచెనా వలదంట కతని తరమె
యతఁడు వలదన్నఁ గాముఁ డేమగును ? కాముఁ
డూరకున్నను విరితూపు లూరకున్నె ?

ఆ దుర్లభుఁడెవఁడో యెందున్నవాఁడో తెలుపుదురేని నే నెట్టిశ్రమకైన నోర్చి యాతని సులభునిఁజేసి మీకడకుఁ దోడ్తెచ్చెద.

మంత్రి—(చిఱునవ్వుతో) నీవు దూర మేగ నక్కఱలేదు. అతఁడీపురముననే యున్నాఁడు.

ఉగ్ర—ఈపురముననే యున్నాఁడా ? ఆ మహాత్ము నే నెఱుఁగుదువా ?

మంత్రి—నిన్ను నీ వెఱుఁగుదువేని వానిఁగూడ నెఱుఁగుదువు.

ఉగ్ర—అతఁ డిప్పటికి నా మనోగోచరుఁడు కాలేదు. ఇప్పు డెందున్న వాఁడు?

మంత్రి—(నవ్వుచు) ఇప్పుడు నా సముఖమందే యున్నాఁడు.

ఉగ్ర—(తనలో) ఏమి? ఆ యదృష్టవంతుఁడను నేనే యగుదునా? (పైకి) మీ సముఖమున నున్న యతఁడు దుర్లభుఁడు కాఁడు.

మంత్రి—ఉగ్రసేనా! ఇఁక సందిగ్ధవచనములతోఁ బ్రయోజనమేమి? ఇటు విను. మా విషయ యొక్క నాఁడు సాయంకాలమున మేడమీఁది గవాక్షమునుండి స్వారి వెడలు నిన్నుఁ జూచెనఁట. చూచి, నీ నామధేయాదులు చెలిమికత్తెలవలన విని వలవంతం దగిలెనఁట. తగిలిననాటంగోలె యిట్లున్నదని సఖులు నాకెఱిఁగించిరి.

శా. నీ నామంబె జపించు, నీ సొగసె వర్ణించు న్సదా కేలు, నీ
జ్ఞానంబే కొనియాడు నీ జయములే శ్లాఘించు, నీ గాథలే
వీనుల్ కోరి వినంగ వేడుకపడున్, నీ విక్రాంతియే మెచ్చు, నే
భూనాథు న్దలపెట్టనీయదఁట, యా మోహంబు పెద్దే కదా.

అందుచే నీ వా బాలికం జేపట్టి యామెయును నాయును మనోరథసిద్ధిఁ జేయఁ బ్రార్థించుచున్నాఁడ.

ఉగ్ర—(లేచి సంతోషముతో) ధన్యోస్మి! ధన్యోస్మి! దీనికి మీరు నన్నుఁ బ్రార్థింప వలయునా? మీ కల్లుఁడ నగుటకన్న నాకు మహాభాగ్యము కలదే? ఇది నాకు బహుతపఃఫలము. బహుజన్మసుకృతఫలము. కోటానకోటులు ధనము వ్యయము చేసినను, మహీమండలంబంతయు నోలిగా నిచ్చినను నే కన్యాలలామహస్తంబు దుర్లభంబో, యా సుందరి నా కప్రయత్నముగ లభియింప నున్నది. చిరకాలమునుండి యీ మోహనాంగిపై వలపు నిలిపి, నా కామె నిమ్మని యొకటి రెండుసారులు మిమ్ము డుగఁదలఁచి యు లబ్ధమనోరథుండఁ గాకపోవుదు నేమో యను నను మాన మూరక యుంటిఁ. ఇపుడు నా భాగ్యము పండెను. జన్మము ధన్యమయ్యె. తపము వన్నె కెక్కె. ఇఁక నేను మీ దానుఁడ.

క. మొలఁగెద నీ కనుసన్నల
నిలిచెద నీ యాన మౌళి, నీ చరణములఁ
గొలిచెద, నిఁక నా ప్రాణం
బులు నీయవి, నా శరీరమును నీయదియే.

మంత్రి—(తనలో) నా ప్రయోగించిన మోహరసము వీని తలకెక్కినది. ఈతిక్క తిరుగకుండ మతియొక్క రసము గ్రుక్కెడు త్రాగించెద. (ప్రకాశముగా) ఆయుష్మం

తుఁడా! నా తలపై నున్న మహాభారమును దింపితివి. ఇప్పుడున్న నీ ప్రథమకళత్రమునే యగ్రమహిషిగ, సహధర్మచారిణిగఁ జూచుకొనవచ్చు. నాకూఁతురు నీకు ద్వితీయ భార్యగ మెలంగుటకుఁ జింతింపదు. అది యటుండనిమ్ము. నీకు మతియొక శుభ మెఱిఁగించెద. పుళిందుని సింహాసనభ్రష్టునిఁ జేయుటకే నే నిపుడు చందనావతికిఁబోవుట. ఆ రాజ్యమునకు నిన్నభిషిక్తుంజేసి యా సింహాసనము మీఁద నిన్నుఁ గూర్చుండఁబెట్ట వలయునని నేను సంకల్పించితిని. నా యల్లుఁడ వైన పిదపఁగూడ మునుపటియట్లు సామాన్యుఁడవై యుందువా? ఇఁకమీఁద నీవు విమయామనోహరుండవై, పుళింద మేదినీశ్వరుండవై, కుంతలరాజసైన్యాధిపతివై, బుధజనగేయమానకీర్తివై యుందువు.

ఉగ్ర—ఆహా! సుఖముగాని, దుఃఖముగాని యొంటిగ రాదను నార్యోక్తి నిజము.

తే. గీ. చిలుకలట్టులు గుంపుగుంపులుగ వచ్చి
సురుచిరానంద మొనగూర్చు శుభములెల్ల
వలసితోఁడేళ్ళగతి మందమందలగుచుఁ
జేరి కష్టముల్ ప్రజల హింసించి పోవు.

నామనస్సానందమునఁ బట్టఁజాలకున్నది. మీ ముదల యయ్యె నేనిఁ జందనావతికిఁ దీసికొని పోవలసిన సైన్యము నాయత్తము జేసెద.

మంత్రి—అట్లేచేయుము. పయనము రేపుదయము.

ఉగ్ర—చిత్తము. (తనలో) అయ్యో! పౌర్వాపర్యయులు బాగుగ విచారింపక మంత్రిమాటల నుబ్బి, విమయాసౌందర్యము తలంపుకంబోలఁ బరవశుఁడనై సంతానవతియు, సౌభాగ్యరాలు, బరమపతివ్రతయు నగు భార్యయుండ వేఱొకభార్యఁబరిగ్రహింప నొప్పుకొంటిని. ఎంత యనుకూలవతియయిన నంగనకు సవతిమత్సరముండుట సహజము. ఈ వార్త నామె చెవి నెట్లువేయుదును? అది విని యామె భిట్టునగవకున్నె! ఈ వితర్కములకేమి? మంత్రితోడి బాంధవ్యము, మహైశ్వర్యము, రాజ్యాధిపత్యము, విశేషించి నవవిలాసవతీపాణిగ్రహణము గలుగుచుండ నాఁడుదాని కోపులకు మత్సరంబులకు వెఱచి యాసంపదలు చెడఁగొట్టుకొందునా?

తే. గీ. గొప్పలాభము ల్చాల చేకూఱునపుడు
స్వల్పనష్టము ల్తలంపున నిల్పరాదు
పసఁగు లొకటి రెం డెప్పుడో పడునటంచు
వాన వలదంచుఁ గోరెదువారు కలరె.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—(తనలో) ఆహా! కాంతాకనకంబులు, మోహపిశాచము కని ప్రపంచమున విడిచిన కవలపిల్లలుగదా! ఎరకుఁబడనిజంతువులు, కాంతాకనకంబులకు లోఁగని మనుష్యులుఁగలుగుట యరిది. ఎల్లవస్తువులకుం బలెఁ బ్రయోజనముంబట్టి మనుష్యులకును వెలగలదు. ఎల్లజంతువులకుంబలె మనుష్యులకు నెరగలదు.

తే. గీ. ఒకఁడు డబ్బు కక్కుఱితిచే నొదిగియుండు
నొకఁడు స్త్రీలోలతను విధేయుఁడయి మెలఁగు
నొక్కఁడు ముఖస్తుతులచేత నుబ్బి లోఁగు
నొక్కఁ డధికార మెరఁజూప నూగకుండు.

ఉగ్రసేనునియొద్ద నీ నాలుగు కక్కుఱుతు లున్నట్లు కనఁబడుచున్నవి. ఉండుట చేతనే నా కార్యసిద్ధి కానున్నది. ఈతని లోఁ బఱచుకొనుట యత్యావశ్యకము. ఏలయన నా కార్యసిద్ధి యీతని చేతిలోనుండుటచేత దేవమిహిరుఁడు నిర్మించిన కృత్రిమ జాతకమును నమ్మి, రాజు చంపకమాలినిని నాపుత్రునకిచ్చి పెండ్లి చేసినను నృపాలుని పరోక్షమున మా మదనుఁడు గద్దెనెక్కవలసివచ్చినప్పుడు ప్రజలు సామంతులు మత్సరంబునఁ దిరుగఁ బడవచ్చు. అప్పు డుగ్రసేనుఁడే యా కలఁత లడఁపవలసినవాఁడు. ఒకవేళ రాజు తనకూఁతును మఱియొక రాజనందనునకిచ్చి వివాహము సేయునేని, రాజమరణానంతర మల్లునిఁ బాఱఁదోలి సింహాసనముమీఁద మదనునిఁ బ్రతిష్ఠింప సంకల్పించినవాఁడను గావున నప్పుడునుఁ గార్యభార ముగ్రసేనునిదే. విషయకంఠమునఁ గట్టఁబోవు మంగళసూత్రముచేత నీతఁ డీకార్యమునకు బద్ధుఁ డగును. కాని, విషయ యుగ్రసేనుని వరించునా? ఏలయన, నాతనికద్ద,

మ. జవరాండ్ర న్వలవంత ముంచెడు సుహాసౌందర్యమా లేదు, లేఁ
త వయస్సా నెఱసున్న, సద్గుణములా తద్వంశమందే లభిం
పవు, మా బాలికయో, వివేకగుణసంపద్రాశి, సంప్రాప్తయు
క్తవయోరూప, వరించు నెట్లితని, హా! కర్తవ్యమే మీయెడన్ ?

కర్తవ్యమున కేమున్నది?

తే. గీ. వినయమును విద్యయునుఁ గల్గు బిడ్డ విషయ
దాని పితృభక్తి వర్ణింపఁ దరమె కాదు
కాన నామాట మన్నించుఁ, గాకయున్న
బలిమి నేనియుఁ గావింపవలయుఁ బెండ్లి.

బలిమిని వివాహము గావించినచో బాలిక యావజ్జీవము సౌఖ్యమునకు వెలియై మనఃఖేద మొందదా? ఆ! పొందిన నేమి? మొదట నన్యోన్యానురాగమున వరించుకొని

వధూవరులు వివాహానంతరము పొత్తులు సెడి దుఃఖభాజనములైనవా రెందఱులేరు ? అదియునుం గాక,

మ. ధరణీమండల మండనాయిత మహోద్యద్భూతలక్ష్మీధురం
ధరభాగ్యం బొనగూడు కాలమిదె ప్రాప్తంబయ్యె, నద్దాని ముం
దర నీ బాలిక సౌఖ్యమెంత ? మతి మోదంబెంత ? నే నిత్తు రా
జ్యరమాదేవికిఁ బుత్రికాసుఖబలిన్ సంకల్ప మీడేఱఁగాన్.

అట్లు పొత్తులు సెడెనేని, వానినే వలచి మా బాలిక పలవంతపా లగుచున్నదని నే నుగ్రసేనునితోఁ బలికిన పలుకు లసత్యములని యుగ్రసేనుఁడు తెలిసికొనునేమో కదా ! అప్పు డేదో పన్నుగడ పన్ని యుగ్రసేనుని మనస్సునకు నచ్చునట్లు పలుకవలెనా ? అంత దూర మేలవచ్చు ? ఈ నడుమ నేను జందనావతినుండి వచ్చునప్పుడు కాంచనమాలచేత బాలికమనసు మెత్తఁబడి యుగ్రసేనునియందుఁ దగులుకొనునట్లు నయమున భయమునఁ జెప్పించెద.

[అప్పుడు కాంచనమాల ప్రవేశించుచున్నది.]

కాంచ—జయము జయము దేవా !

మంత్రి—(చూచి) కాంచనమాలా ! వచ్చితివా ?

కాంచ—అమ్మాయిజడ సగమల్లి వచ్చితిని. ఏమి సెలవు ?

మంత్రి—నేను జందనావతికి రాజకార్యప్రసక్తిని రేపుదయము పోవుచున్నాఁడ. అది యటవీస్థలమగుట నెమిలిపింఛములు, చమరీవాలములు, లేడిపిల్లలు, దుప్పికొమ్ములు, పులిగోళ్లు, పునుఁగుఁబిల్లులు, మొదలగు మనోజ్ఞవన్యవస్తువులలో నీకును, విషయకు నేవి కావలయునో వినఁగోరుచున్నాఁడ. నీవును నాకు విషయవంటి బిడ్డవే. ఆమెం బెంచినట్లే నిన్ను నీచేతులఁ బెంచితి. నీమనోరథంబుఁ దీర్చుటయే నాకుఁ బ్రథమ కర్తవ్యము.

కాంచ—దేవరవారి కంత యనుగ్రహ ముండుటచేతనే నేనింత వర్ధిల్లుచున్నదానను.

మంత్రి—నీ యోగ్యతకుం దగిన యాదరము మేము సేయుటయే లేదు.

కాంచ—దేవా ! దేవరవారు చందనావతి కరుగుట రాజకార్యమే ముఖ్యకారణమైనను బుత్రికావరాన్వేషణముంగూడ మీమనసులో నొకమూల నిలుపవలయునని కోరుచున్నదానను.

మంత్రి—(నవ్వుచు) ఓ వెఱ్ఱిదాన ! రాతిగనులలో రత్నములు దొరకవు. కోయమూఁకల కునికిపట్లగు కొండలలో, నడవులలోఁ బెండ్లికొడుకులు లభింతురా ? వరసో

న్వేషణమనఁగా నేఁజ్ఞప్తికివచ్చినది. బిడ్డ యెవ్వనిమీఁదనైన మనసు నిలిపినదేమో చెప్పఁగలవా? ఈవిషయము నీకన్న నెఱిఁగినవా రుండరు.

తే. గీ. అంతిపురినుండు కాంతల యభిమతములు
ప్రతిఫలించునద్దంబులై పరిఢవిల్లు
తెలివిగల్గిన చెలిమికత్తెల మనసులు;
చెలువెఱుఁగని రహస్యము గ్గలవె! సతికి.

కాంచ—ఆమె యిప్పటి కెవ్వనిమీఁదను మనసునిలిపినట్లు తోఁపదు.

మంత్రి—కాంచనమాలా! పుత్రికావివాహవిషయము తలఁచుకొనినప్పుడెల్ల నా గుండె ఝల్లుమనుచుండును. ఏమనఁ బొరుగూరిలోనున్న యే రాజనందనుని చేతిలోనో పెట్టి నేను బిడ్డనెడబాసి యుండఁజాలమునని. విషయనువిడిచి నేను, నన్నువిడిచి విషయయు నుండఁజాలము. అదికారణంబుగఁ బుత్రిక నీపట్టణమునందే నా సమక్షమునందే నిరంతరముండువాని కెవ్వనికైన నిచ్చి వివాహము సేయవలెనని యున్నది.

కాంచ—ఈ పట్టణమునఁ దగిన వరుఁ డెవ్వఁ డున్నాఁడు?

మంత్రి—లేకేమి? ఒక రిద్ద ఱున్నారు. సేనాపతియగు నుగ్రసేనుని నెన్నఁడైనఁ జూచితివా?

కాంచ—(నవ్వుచు) విషయ నాతనికిచ్చుట కాకిముక్కున దొండపండు గట్టుట. జాజిపూవులదండ దున్నపోతు మెడ వేయుట.

మంత్రి—ఏమి? జాజిపూవులదండ దున్నపోతు మెడ వేయుటా? ఇష్టములేక యిట్లనెదవుకాని వాని కేమికొఱత?

తే. గీ. మనసు కుదుర నేనిఁ గురూపి మన్మథుండు
కుదరకుండిన వలరాజు కొండముచ్చు
మన మనోభావనలె కాని మందయాన!
మంచిచెడ్డలులేవు సు మ్మెంచిచూడ.

ఉగ్రసేనుని చక్కఁదనము కూడ గొందఱు రాచకన్నియల వలపించినదే. అతఁడు సర్వలక్షణసంపన్నుఁడు. ఒకవేళ బాలిక యాతనిని వేఱుగాఁ దలంచినను నీ వాతని లక్షణంబుల ననయంబు వర్ణించి, పొగడి యామె మన సాతని యందు లగ్నం బగునట్లు చేసి నాకుఁ బుత్రికావియోగదుఃఖము తప్పింపవలయు. ఆ వర్ణించుటలో,

మ. హానుమానుం డనుమా భుజాబలమునం, దాయోధనక్రీడలం
దనుమానం బణుమాత్ర మూనఁ డనుమా, యా దేవతాచార్యుఁడే

యనుమా బుద్ధికి, నా దిశేషుఁ డనుమా యత్యంత వాక్ప్రౌఢిమం
బున, నా నిర్జరసార్వభౌముఁ డనుమా భోగంబులం దన్నిటన్.

అంగనకు వీరపత్ని, వీరమాత యగుటకన్న నపేక్షణీయము వేఱొండు లేదనుము. ఈతని చెట్టఁబట్టు నేని బిడ్డకీ రెండును సమకూడుననుము. నీ వెన్ని చెప్పిన నామె వినకున్న నా నిమిత్తము గ్రిసేనుని కేలు పట్టుమనుము. తండ్రిమాట నిలుపఁదలఁచి గాంధారి యంధుని బెండ్లియాడెననుము. భీష్ముఁడు పితృసౌఖ్యము ప్రధానముగఁ జేసికొని స్వసౌఖ్యంబు పాటింపఁ డయ్యెననుము. రఘురాముఁడు పితృవాక్యపాలనమునకై వనవాసమున కరిగెననుము. తనమీఁది మమతచేత నే నింతగా నొక్కి చెప్పవలసివచ్చెననుము. కాంచనమాలా! బిడ్డమనసు నీమనసు నొక్కటియే గావున గార్యసిద్ధి నీవు చెప్పుటలో నున్నది. బిడ్డమీఁద జనకునకున్నంత ప్రేమ, బిడ్డకు జనకునిమీఁదనుండుట సహజము కాదు. కాని నీ సహాయమున నిప్పుడది సహజము కావచ్చు. నా హృదయశల్యము నీవే పెఱుకవలయును. చందనావతి నుండి నేను వచ్చులోన నీవామెను వివాహమునకు సిద్ధము చేయవలయును. నా బిడ్డచెలికత్తెలలో యోగ్యతకు, గురుజనగౌరవమునకు, దాని యెడఁ బ్రేమకుఁ బేరువడినదానవు కావున నిన్నీ పనియందు నియోగించితిని. విషయమును విడిచి నీవును, నిన్ను విడిచి విషయయము నుండఁ జాలరు కావున నీకుఁగూడ నీయూరనే యనుకూలమైన సంబంధము విచారించి యుంచితిని. అది నీ యదృష్టమువలన లభించినది. నేను దిరిగివచ్చినపిదప నీ వెఱుఁగఁగలవు.

కాంచ—(సిగ్గునఁ దలవంచుకొని) దేవా! అమ్మాయి సదసద్వివేకశాలిని. మా యిరువురమనస్సు లొక్కటియే యనుమాట నిజమే కాని యీవిషయములో నామాటయే పాటిసేయునని ధైర్యముతోఁ బలుకఁజాల. అయినను సర్వవిధములఁ గార్యసిద్ధికి నా లోపములేకుండఁ బ్రయత్నించెద. తనయాస్నేహమే కాని స్వలాభపరాయణత యిందేమియు లేదు కావున మీసంకల్పము నెఱవేఱవచ్చును.

మంత్రి—సరే. నీవింకఁబొమ్ము.

కాంచ—చిత్తము. (నిష్క్రమించుచున్నది.)

మంత్రి—(తనలో) బాలికాసఖీజనమందుఁ గాంచనమాలయే మెత్తని మనస్సు కలది. తక్షీనవాంద్రు దేవతలకుఁ బంచాంగము చెప్పువారు. అదియునుంగాక బిడ్డకు దీనియందు విశ్వాసము మెండు. ఇదియు నా పన్నినవలలోఁ బడినది. ఈ లక్షణములం బట్టి చూడ నామనోరథసిద్ధి సమీపమునకు వచ్చినట్లు తోఁచుచున్నది. ఇంక మదనునకు నా ప్రయాణసన్నాహ మెఱిఁగించి, చెప్పవలసిననీతులను జెప్పి నావచ్చువఱకు రాజు వద్ద వానిఁ బరీక్షించెద. (పైకి) ఓరీ! యెవఁడక్కడ? మదనుఁ డెక్కడ నున్నాఁడు?

మందరుఁడు—(ప్రవేశించి) దేవా! అబ్బాయిగారు గవ్వలగదిలో నున్నారు పిలుచుకొనివత్తునా ?

మంత్రి—అక్కఱలేదు. నేనే వచ్చెదను. దారిఁ జూపుము.

మంద—దేవా! యిటు యిటు (అని కొంతదూరము నడచి యిద్దఱు గదిప్రవేశించుచున్నారు.)

[అంతటఁ జేతఁ బుస్తకము పుచ్చుకొని చదువుచుఁ బీఠముపైఁ గూర్చుండి మదనుఁడు ప్రవేశించును.]

మంద—(గదినిఁ బ్రవేశించి) కుమారా! ఇదె నాయనగారు నీ నిమిత్తము వచ్చియున్నారు.

మద—(లేచి పుస్తకము మూసి తొట్రుపాటుతో) నాయనా! ప్రణామము చేయుచున్నాఁడను.

మంత్రి—కళ్యాణమస్తు!

మంద—దేవా! నేనుపోయి ద్వారముకడ నుండెదను. (అని నిష్క్రమించును.)

మంత్రి—కుమారా! నీ వెల్లప్పుడు గ్రంథకీటకమువలెఁ బుస్తకములనే యాశ్రయించి యుండెదవుగాని, లౌకికవ్యాపారములయందు నీబుద్ధిఁ జొనుపవేమి? విద్యముగిసినపిదపఁగూడ గ్రంథముల గొడవ యేల?

మంద—నాయనా! వివేకి యావజ్జీవము విద్యార్థియే. విద్యకు సమాప్తి కలదా! అయ్యది పరబ్రహ్మంబునుం బోలె, దేశకాలవస్తువులచేత నపరిచ్ఛేద్యంబై యనాద్యంబై యనంతంబై వెలయును.

మంత్రి—అట్లయిన మనుష్యుఁ డెల్లప్పుడు గురుకులవాసము సేయవలసినదే?

మద—కాదు. గురుకులవాసము కొంతకాలమే. గురుబోధ తల్లిపాలవంటిది. తల్లిపాలు విడిచి నరుఁ డాహారమును స్వయముగఁ దెచ్చుకొని దేహపోషణముఁ జేసికొన్నట్లు గురుకులంబు విడిచియు మనస్సున కాహారమైన విద్యను సంపాదింపవచ్చు. ఎట్లన,

మ. తనపూర్వుల్ గణియించి యిచ్చుధన మాధారంబుగా నెంతయో నే
ర్పున వాణిజ్యము సల్పి లక్షలధనంబుంగూర్చు బేహారి నాఁ
ఘనులౌ పూర్వులు వ్రాసియిచ్చిన మహాగ్రంథంబు లాధారముల్
గ నకుండార్జన సెయఁగా వలయు విజ్ఞానార్థ మెంతేనియున్.

తండ్రీ! వేయుమాటలేల? పుస్తకమువంటి మిత్రము మఱియొకటి లేదు.

మంత్రి—ఈ విశ్రామమును విడిచి యింక లౌకికవ్యవహారములోఁ బ్రవేశించుట యెన్నఁడు ?

మద—అవసరమైనపుడు.

మంత్రి—ఇదిగో నవసరము వచ్చినది వినుము. మహారాజుగారి యాజ్ఞాప్రకారము నేను జందనావతికి రేపుదయము పోవుదు. నేను వచ్చువఱకు నీవు మంత్రిత్వము సేయవలయునని రాజుగారి యాదేశము.

మద—రాజ్యతంత్రమున కపరిచితుఁడనగు నేను మంత్రిత్వ మెట్లు సేయఁగలను ?

మంత్రి—నా యుపదేశబలమున.

మద—సావధానుఁడనయి యున్నాఁడను. ఉపదేశింపుఁడు.

మంత్రి—నా యుపదేశము నీకు రాజనీతివేదమునం బ్రవేశము కలిగించు గాయత్రీమంత్ర మగుఁగాక !

తే. గీ. క్షితివిభునిచెంత కన్యునిఁ జేరనీకు
మతని నొరులతో నెపుడు మాటాడనీకు
మాతఁ డేమడిగిన నిన్నె యడుగవలయుఁ
జెప్పఁదగు నుత్తరము నీవె చెప్పవలయు.

ఇది మనయధికారము స్థిరముగా నిలుపుకొనుటకుఁ బ్రథమోపాయము. రంధ్రాన్వేషణపరులగు దురాత్ములు కొందఱు నేను లేని యదను గనిపెట్టి రాజుతోఁ గొండెములు చెప్పఁ జూతురు. అట్టి పురుషసర్పముల కీ యుపాయ మౌషధిరాజము. మఱియు,

తే. గీ. పంజరస్థితశుకమట్లు పార్థివుండు
మంత్రి నేర్పిన పలుకులె మరల ననుచు
నొరులఁ జూడక కోటలో నుండవలయు
భూవిభుఁడు మంత్రిచేతి కీల్బొమ్మగాదె ?

రా జెవ్వరికేమి ప్రత్యుత్తరము లిచ్చినను మంత్రి యాతనికి చెవిలోఁబోసిన వాక్యామృతమే నోట వెలువడవలయును. ఇది రాజువిషయము. ఇఁకఁ బ్రజావిషయమై మంత్రి సేయవలసినది చెప్పెద వినుము.

సీ. వట్టిమాటల వాస పుట్టింపవలయును శూన్యత క్రియలలోఁ జూపవలయు
నేఁడేటఁ బన్నులు హెచ్చింపవలయును బ్రజలేడ్వఁ గృప నటింపంగవలయుఁ
బ్రజల పక్షమువారిఁ బైకి మెచ్చవలయు నదనువచ్చినయప్పు డడఁపవలయు
విద్యాభిమానంబు వెలికిఁ జూపవలయు శాస్త్రవిద్యాబోధ చంపవలయుఁ

తే. గీ. ప్రజల విశ్వాసమే రాష్ట్రబలమటంచు
నమ్మనటులుండి, జనులను నమ్మకుండ,
ఖడ్గమునె నమ్మి యేలుట కార్యమగును
ఖడ్గనీతి మించిన నీతి గలుగదెందు.

మద—తండ్రీ! లౌకికవ్యాపారములం బ్రవేశించుట యింద్రజాలవిద్య నభ్యసించుట,

మంత్రి—అవును. మంత్రి యింద్రజాలికుని వంటివాండే. ఎట్లన,

క. ఇరువురు వైరుధ్యము తమ, యఱచేతులం జూపనేర్తు, రధికంబుగ ని
ర్వరకుండు వాక్యలాఘువ, కరలాఘవశక్తి జనులం గనుంగ్రామటకున్

మద—ఇది నాబోంట్లకు దురవగాహమేమోయని భయపడుచున్నాండను.

మంత్రి—అట్లు కనంబడునుగాని నిజముగా దురవగాహము కాదు. మనుజునకు దురవగాహమగు విషయము లోకముననే లేదు. లోకవ్యవహారమునం దొకసారి ప్రవేశించితివా, మనుజశక్తము చక్కగొన్న ... గాని విడువుమన్నను విడువవు.

మద—మీ యాజ్ఞాప్రకార మెట్లో నేను కొన్ని దినములు రాజసన్నిధినుండి కార్యము నడపెద.

మంత్రి—కుమారా! మంత్రియగుటకు నీ మన సొప్పకున్న దిగదా. పోనీ, రాజ వగుట కిష్టమున్న దా?

మద—నాయనా! మంత్రిత్వమునకే యనర్హుండనని నేను భయపడుచుండ రాజత్వమునకుం దగుదునా?

మంత్రి—తగ కేమి? గద్దె నెక్కి, చిత్రపు, పిండిబొమ్మ రాజ్యము చేయంగలదు. పరిపాలనాక్లేశము మంత్రిదిగాని రాజుది కాదు.

మద—నేను దాని కనర్హుండ. అది యటుండనిండు. అసంభవములు నసాధ్యములునగు విషయములంగూర్చి మన కీ వితర్కమేల? నేను రాజ్యమున కాసపడుట యాకాశపద్మము నందుకొనం జేయిజాంచుట.

మంత్రి—ఇది యసంభవము కాదు; యసాధ్యము కాదు.

మద—ఎట్లు సాధ్యమో వాదయుకొఱకు వినం గోరుచున్నాండను.

మంత్రి—రాజపుత్రికయగు చంపకమాలినిని నీవు వివాహమాడుటవలన,

మద—(చెవులుమూసికొని) హా! ఎంతకష్ట మెంతకష్టము.

తే. గీ. అన్నయని పిల్చె నామె న న్జిన్ననాంట
విషయయును నాకె నేడును బిలుచుకొందు

దక్కచెల్లెండ్రవరుస నట్లగుట సిద్ధి
తలఁపరానివావియు నిల్వఁ దగని తలఁపు.

మంత్రి—(నవ్వుచు)

క. ఎక్కడివావులు మదనా! యెక్కడి వరుసలివి యేల యీ వెలఁతనం
బక్కలికి యెట్టిచెల్లెలు, నెక్కడి సోదరుఁడ వామె కీవును జెపుమా.

ఏకోదరులకు, నక్కచెల్లెండ్ర సంతానమునకు, నన్నదమ్ముల బిడ్డలకు సోదరభావములు చెల్లునుగాని పూర్వబాంధవములు లేనివారికిఁ జెల్లవు. ఇవి పిలుచుకొనుట కేర్పడిన సంకేతములుగాని యర్థముగల వావులుగావు. అందుచే నీవామెను మఱఁదలా యని పిలిచిన మఱఁదలగును. చెల్లెలాయని పిలిచినఁ జెల్లెలగును.

మద—అయ్యా! మీ రెన్ని చెప్పిన నా యంతరాత్మ నన్నిందు కొడంబడ నీయకున్నది.

మంత్రి—(నిందాగర్భముగా) అంతరాత్మ యొడంబడనీయదేమి? ఈయంతరాత్మలు దేశమునఁ గ్రొత్తగా దిగినవి. మాచిన్ననాఁడు మాగురువు లంతరాత్మ లున్నవని మాకెన్నఁడుఁ జెప్పలేదు. మే మింతవఱకెఱుఁగము. ఈనాఁటి యుపాధ్యాయులు పూర్వములేని యంతరాత్మలు గింతరాత్మలు తెచ్చిపెట్టి విద్యార్థుల మతులు విఱిచి వారిని బాడుసేయుచున్నారు. ఆభ్రష్టులలో నీ వొకఁడవు. నాబోధ నీ తలకెక్కదని నే మొదటనే యనుకొంటిని. ఏలయన,

మ. తమితో నొజ్జలయొద్ద నేర్చుకొను గ్రంథజ్ఞానమే కాని ని
త్యము లోకానుభవంబునం గలుగు భవ్యజ్ఞాన మొక్కింత గ
ల్గమి విద్యార్థులు తామె సత్యనిరతుల్ సద్ధర్మసంచారు లం
చు మది న్గర్వము దాల్చి లౌకికు సతోషుంబోలె గర్వించుచున్.

మద—తండ్రీ! కోపపడకు. నీరు జడిసి నేనందు కొప్పుకొందు ననుము. రాజా బిడ్డను నాకీయనిచో—

మంత్రి—ఈయనిచో, రాజమరణానంతర మల్లుని బాఱఁదోలి నిన్ను గద్దె నెక్కించెద.

మద—అయ్యో! ఇది రాజద్రోహముకాదా?

మంత్రి—రాజద్రోహము లేదు, గీజద్రోహము లేదు. ఈనీతులు తడసిన రాజ్యము లెల్లుచేపడును. రాజ్యసంపాదనము చేసినవారిలో రాజద్రోహము సేయనివాఁ డెవఁడు? ఈహేమవర్మమహారాజుముత్తాతయగు చిత్రభానుఁడు వెనుకటి వంశపు రాజులలోఁ గడపటి వానియొద్ద సేనాపతిగ నుండి యా రాజుం జంపి గద్దెనెక్కె.

ప్రపంచమున బలహీనములు నశించుటయు బలవత్తరమైనవి మిగులుటయు, సర్వజంతువులయందు సహజము.

మ. వనరాశి న్వనుచేఁ ప్రమింగుఁ జిఱు చేఁప న్బట్టి, వన్యంబులౌ
ఘనసత్వంబులు స్వల్పజంతు వితతి న్గారించి భక్షించు, భూ
జనులంచు న్బలియుండు దుర్బలుని నాళంబందఁగాఁ జేయు, శా
స్త్ర నిషిద్ధం బనరాదు సూ ప్రకృతిధర్మం బిట్టిదే యారయన్.

రాజు మింటనుండి యూడిపడఁడు. సకలజంతువులకు స్వబలతేజోదర్పంబుల కలిమి స్వజాతి జంతువులపై నధికారము కలుగును గాని యది యొకఁడిచ్చునది, యొకఁడు పుచ్చుకొనునది కాదు. అట్లై కావున్న,

సీ. మేఁకపోతునకీక మృగరాజబిరుదంబు సెంచి సింహంబున కెవ్వఁడిచ్చె
గబ్బిలంబునకీక ఖగసార్వభౌమత నవ్వైనతేయున కెవ్వఁడిచ్చె
వానపాముసకీక ఫణివల్లభత్వంబు నాదిశేషున కెవ్వఁ డరసియిచ్చె
మట్టగిడసకీక మత్స్యనాథత్వంబు నాతిమింగిలమున కేతఁడిచ్చె
గీ. ధైర్యసారమిచ్చె, దర్పసంపదయిచ్చెఁ
జండతేజమిచ్చె, శక్తియిచ్చెఁ
గాక యిచ్చెనే యొకఁడు పట్టముఁగట్టి
మంచి మూర్తమందు, మదన ! చెపుము.

మద—నాయనా ! రెండుతరములనుండి మన మీ కుంతలరాజుల సొమ్ము తినినందునకు రాజకుటుంబము నెడఁ జూపవలసిన కృతజ్ఞత యిదియే ? మన కెంతరాజ్యకాంక్షయున్నను జంపకమాలిని మొగమైనఁ జూడవలదా ? ఆమె మనవిషయమంటిదే కదా. ఎంతటి రాజనీతికోవిదులకైన ధర్మభీతి యుండవలదా ?

మంత్రి—(కోపముతో) ఏమి ? మనము కుంతలరాజులసొమ్ము తింటిమా ? పుట్టినప్పుడు కుంతలరాజులు సొమ్ము వెంటఁదెచ్చిరా ? మనము తినుచున్నది ప్రజలసొమ్ముకాని రాజుసొమ్ముకాదు. జాలి దౌర్బల్యచిహ్నము. కృతజ్ఞత యప్రయోజకప్రసంగము. ధర్మభీతి భీరువుల ప్రచారము. కటకటా ! సింగము కడుపునఁ జెవులపిల్లి పుట్టినదిగదా ! ఈవిషయమున నీప్రవర్తనము కనకవర్షము కురియుచుండ గొడుగువేసికొని పోవు మందభాగ్యుని చరిత్రము స్మరణకుఁ దెచ్చుచున్నది. ఓమూఢుఁడా !

శా. నీచత్వంబున నన్న దమ్ములను, దండ్రిం దల్లి హింసించియే
ప్మాచక్రంబు మహీతలేంద్ర తనయు ల్సాధించి చేకొందు రా

భూచక్రం బవలీల నీదు సిగలోఁ బూవాడిపోకుండఁగా
నీ చేతం బడుచుండ వద్దనుటకు న్నీకెట్లు నోరాడెనో.

సామ్రాజ్యపదమున నెట్టిదో నీ వెఱుఁగవు. చూడు.

సీ. ధనరత్నకనకవాహనముఖ్య సర్వసంపదల కాస్పదము సామ్రాజ్యపదము
వైభవంబుల నెల్ల వర్షించు చల్లని ప్రావృడంబుదము సామ్రాజ్యపదము
రాజహంసలు విహారము లొనర్చెడు వినిర్మలమహాహ్రదము సామ్రాజ్యపదము
శ్రితజనంబులకెల్ల జీవనంబులనిచ్చి బ్రతికించు నదము సామ్రాజ్యపదము
తే. గీ. మహిత కళ్యాణపదము సామ్రాజ్యపదము
మాద్రిలేనట్టి పదము సామ్రాజ్యపదము
మాట లింక వేయు నేల కుమార ! వినుము
మహిని దేవేంద్రపదము సామ్రాజ్యపదము.

అనన్యసాధ్యంబు, బహుతపఃఫలసంచితంబునగు నట్టి సామ్రాజ్యంబు నీకుఁ జేపడు నేని దండితారాతిమండలుండవై రెండవ యాఖండలుండునుంబోలె వెలయుచుందువు. అప్పుడు,

సీ. నీరాజితంబౌను నీ పాదయుగళంబు మనుజేంద్ర కోటీర మణులచేత
నిర్వహింపంబడు నీ శాసనంబులు నరపాలపుత్రమండలముచేత
నృత్యంబు లొనరించు నీకీర్తిలక్ష్మి దిగ్దంతిదంతాగ్రరంగములమీఁదఁ
బ్రతినాద మొనరించు బ్రహ్మాండకుహరంబు తతభవత్పటహభాంకృతులచేత
తే. గీ. మండితంబగు నీ మహామందిరంబు, దాసచేటవిలాసినీతతుల చేత
కష్టపడఁదువె బంగారు గద్దెనెక్కి, చేఁదు మేయుదె రాజ్యంబు స్వీకరించి.

మదనా ! దీపమున్నప్పుడె యిల్లు చక్కఁబెట్టుకొనవలయునన్నట్లు నే నుండగానే నీవు బాగుపడు మార్గముల నరయవలయు. నాయనంతరము నీ మొగముఁ జూచువా రైన నుండరు.

మద—(తనలో) ఈయన రాజ్యకాంక్షచే నెట్టి యకృత్యమైనఁ జేయ నుద్యుక్తుఁడై యున్నాఁడు. ఈయనకు నాకు నెన్నఁటికిని సరిపడదు. రాజపుత్రి నాకుఁ జెల్లెలి వావి యగుటచే నెన్నఁటి కామెం బరిగ్రహింపనొల్ల. రాజ్య మంతకుమున్నె నా కక్కరలేదు. ఈయన చెప్పిన కుయుక్తులఁ బ్రతిహతములు చేయఁగలను. కాని యిది సమయముకాదు. వాదించినకొలఁది నీయన యున్మత్తుఁడ ట్లగును. కావున బ్రస్తుతమీ యనను శాంతవచనముల నుపశమింపఁజేసి ముందుముందు మంచిమార్గమునకుం దెచ్చి యీయన చేతనే రాజపుత్రీ వివాహము వలదనిపించెదను. (ప్రకాశముగా) నాయనా!

మీరు చందనావతినుండి వచ్చినపిదప మనమీ విషయము మరల ముచ్చటించి మీయిష్టమువచ్చినట్లు చేయుదము.

మంత్రి—(సంతోషముతోఁ దనలో) ఇప్పటికి వీని తిక్కతిరిగిన ట్లున్నది. (ప్రకాశముగా) వత్సా! పితృవిధేయుఁడవై చిరంజీవివై యుండుము. అఖిలకళ్యాణములునీకగుఁగాక! ప్రయాణము సేయునపుడు మార్గమధ్యంబుననుండియు నవ్వలఁ జందనావతినుండియు నీ వనుసరింపవలసిన పద్ధతుల వ్రాసి పంపుచుండెద. ఆప్రకారము నీ వప్రమత్తుండవై నడుచుకొనుచుండవలయును.

మద—అతుశాల మీరువ్రాసినట్లు చేయుదును.

మంత్రి—సరే. నీ విఁకఁ బొమ్ము.

మద—చిత్తము (అని నిష్క్రమించును.)

మంత్రి—(తనలో) బిరుసుతలఁకల యీ బుడుతని నే డంబఱచునప్పటికిఁ గృత్యాద్యవస్థయైనది. ఎగురవైచినప్పుడు క్రిందఁ బడనివస్తువు, నాతోఁ బ్రసంగించిన పిదప భంగపడని మనుజుఁడు నుండుట యింతవఱకు నే నెఱుఁగను. ఇక్కడి కన్ని యేర్పాటులు నేను సంకల్పించిన ట్లయినవి. ఇఁక నచిరకాలములో నే,

తే. గీ. భాగురాయణరాహువు పట్టుకొనఁగ, సంభవించును జంద్రహాసగ్రహణము
ప్రబలపౌళిందవంశప్రపంచమెల్ల, గాఢదుఃఖాంధకార మగ్నంబు గాఁగ.

ఈసరికి నేను గథాకలాపము చక్కఁగా వినిపించి కుంతలరంగంబున నాకంబున రెం డంకంబు లాడితిని. చందనావతీపురరంగంబున మూడవయంకము ప్రయోగించుటకుఁ బ్రస్తుతము నిష్క్రమించెద. (అని నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.

---



# చతురచంద్రహాసము.

## తృతీయాంకము.

—:(O):—

స్థలము;—చందనావతీపురమందలి రాజవీధి.

[అంతట నొకపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పుర—(తనలో) సౌఖ్యపడవలెనన్న నెక్కడ నుండుట కలవాటుపడిన జంతు వక్కడనే యుండవలెను. పరస్థలవాసము సకల జంతువులకు బాధకరమే.

ఆ. వె. నీటఁదిరుగు మొసలి మెట వచ్చినఁ జచ్చు
బయటఁ దిరుగు ప్రాణి నీటఁజచ్చు
నొక్క నగరవాసి యొండొకచో శ్రమఁగాంచు
స్వస్థలంబు ప్రియము జంతు తతికి. 1

అందుచేతనే యీప్రవాసమున మా చుట్టములు నా కెన్ని యుపచారములు చేసినను నేను సంతుష్టుఁడను కాక మాయూరిమీఁద మాయింటిమీఁద మనసునిలిపి యచ్చట ముండ్లమీఁద నున్నట్లుంటిని. ఇప్పుడు మా చందనావతిఁ జేరుటచే నా కేనుఁగు బలమంత బలము వచ్చినట్లున్నది. (అని కొంచెము నడచి యిట్టటుఁ జూచి) ఏమిది. నగరమంతయు నీవిధముగా నలంకరింపఁబడినది? ఏమోకాని పురజనులు—

సీ. పచ్చితాళలతోడ తెచ్చి యనంటులు ప్రతిగృహాంగణమందు పాతినారు
అన్నియిండ్లకు మామిడాకుతోరణములు కనులపండువుగాఁగఁ గట్టినారు
అలసూర్యకిరణంబు లవనిపైఁ బడకుండ విరివిగాఁ బందిళ్లు వేసినారు
ఆకాశమండలం బంటు మేడలమీఁద నెత్తుగా టెక్కెంబు లెత్తినారు
తే. గీ. వెల్ల గోడల కెల్లను వేసినారు
పసపు గుమ్మంబులన్నిటఁ బూసినారు
జలము వీథుల నెల్లెడఁ జల్లినారు
వింతముగ్గు ముంగిళులందు బెట్టినారు. 2

ఇవి పండుగదినములు కావుగదా! ఈ యుత్సవమున కేదికారణము చెప్పుమా! రాజగృహమందే దేని కళ్యాణము కాలేదుగదా. చంద్రహాస కుమారునకు వివాహమై యుండునా? నేను వెళ్లినప్పటి కట్టిమాటలు పుట్టినట్లు లేదు. అదిగో నెవరో యిటు వచ్చుచున్నారు. ఈ మహోత్సవకారణ మీతని నడిగెద. (అని కొంతనడిచి చూచి) ఇతఁ డెవ్వఁడో విదేశస్థుఁడులాగున్నాఁడు. విదేశస్థుఁడు మాత్ర మడిగినమాట కుత్తరముఁ జెప్పఁడా! (అని సమీపమునకుఁ బోవును.)

[అంతట మందరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మంద—(తనలో) వెనుక మంత్రిగారితో నీ పురమునకు వచ్చిన ముసలిబంట్లు 'చందనావతీపురమున నీవు చూడఁదగిన దేమియునులేదు. అది బొమ్మచెముడు డొంకలతోను, బోడి గోడలతోను నిండిన పల్లెయూ' రని నాతోఁ జెప్పిరి. వారి మాటలు కేవల మబద్ధములుకదా! ఈ పురము వైభవమున మా కుంతలనగరమును మించియున్నది. ఎంత చూచినను మనసు తీరకున్నది. ఇంకం జూచెదగాక. (అని నడచును.)

పుర—అయ్యా! మీ దేయూరు?

మంద—మా యూరిజోలి నీ కేల? నీకుఁ గావలసినదేమో యడుగుము.

పుర—ఈ యుత్సవకారణ మేమో యెఱుఁగుదువా?

మంద—ఎఱుఁగుదు. మహామంత్రియైన భాగురాయణుఁడు కుంతలపురమునుండి యిచ్చటికి విజయముచేసెను. ఆయనను సన్మానించుటకు చంద్రహాసకుమారుఁడు తండ్రియుఁ బురమంతయు శృంగారింపఁ జేసిరి. నే నా మహామంత్రి పరిజనులలో నొక్కఁడను. నా పేరు మందరుఁడు. నీ దీయూరు కాదా?

పుర—అయ్యా! నా దీయూరె! కారణాంతరమున మా చుట్టములంజూడ నేను విదర్భకుఁ బోయి వచ్చుచుంటిని. అందుచే నమాత్య భాగురాయణునిరాక నే నెఱుంగను. మంత్రిగారి పరిజనుఁడవైన నీకు స్వాగతము. మీ ప్రభువుగా రిక్కడ నెన్ని దినము లుందురు?

మంద—నాలుగైదు దినములుందురు.

పుర—అట్లయిన నే నా మహాత్ముని దర్శనముఁ జేసి ధన్యుఁడ నయ్యెద.

మంద—అట్లే చేయవచ్చు. (అని యిద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

రంగము. 1.

భాగురాయణుని బిడిదియింట నొకగది.

[అంతట మంత్రియైన భాగురాయణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

మంత్రి—(తనలో) ఏమియు సందేహము లేదు.

తే. గీ. ముద్దులను మూట గట్టు నెమ్మొగమువాఁడు
కలువరేకులే యనఁదగు కనులవాఁడు
భవ్యగుణముల కిరవైన వాఁడు నైన
నేఁటి వీఁడు నిశ్చయముగ నాఁటివాఁడు. 3

దురాత్ములైన హంతకులు నన్ను వంచించిరనుట నిర్వివాదాంశము. పదునాలుగేండ్ల క్రిందట జూచినదియైనను వీనిమూర్తి సర్వవిధముల నా కానవాలు పట్టఁదగినదియై యున్నది. ఈచంద్రహాసహతకుని ప్రజ్ఞా విశేషముచేతనే గదా పౌళిందవంశ మింత పేరువడినది. ఈదురాత్ముని ప్రయత్నముననే గదా పూర్వము చూచునప్పుడు రోతపుట్టఁ జేయు చందనావతి యిప్పుడు కుంతలంబును వెక్కిరించున ట్లున్నది.

తే. గీ. పాడు దొడ్లెల్ల చక్కని మేడలయ్యె
బయళు లన్నియు నుద్యాన వనములయ్యె
నిఱుకుసందులు వెడదలౌ తెరవులయ్యె
నాల్గు గుడిసెల పల్లియు నగరమయ్యె.

తేజోరాశియైన యీడింభకుఁ డచిరకాలంబున కుంతలంబు నాక్రమింపకున్నె! ఇతఁడు మా మదనుని రాజ్యసుఖము భుజింపనిచ్చునే.

శా. ఏరీతిన్ రుచియించు నన్నము మన స్సేరీతి నిశ్చింతమౌ
యేరీతిన్ సుఖనిద్రఁగల్గు నిఁక రేయి న్నాకు నాబిడ్డకున్
శూరాగ్రేసరుఁడై వినీతుఁడయి దుష్టుండై మహీపాలకాం
తారాభీలదవాగ్నియై పగతుఁడుండం బ్రక్కలో బల్లెమై. 5

ఇన్ని మాటలేల—

ఆ. వె. నిప్పుకొండచెంత నిలయంబు గట్టుట
పాముపుట్టప్రక్క పండుకొనుట
చంద్రహాసనృపతి సవిధభూములనుండ
ధరణి నన్యుఁడేలఁ దలఁచుకొనుట. 6

తల యెత్తనిచ్చితిమా వీరుఁడు బాల్యమునుండియే పెచ్చు పెరిఁగి నేలయంతయు నాక్రమించును. పిల్లయని త్రాచుపామును, బెబ్బులినిఁ జంపక విడువరాదు. నలుసే గదాయని నిప్పార్పక మానరాదు. శుభలక్షణములన్నియుం బట్టిచూడఁ జంద్రహాసుఁడు జ్యోతిష్యులు చెప్పినట్లు మహీమండల మంతయుఁ బాలించునట్లుఁ దోఁచెడిని. కావున నీతఁ డవశ్యము వధ్యుఁడు. ఈతని నెట్లు వధింతు.

తే. గీ. ప్రబల దుస్తంత్ర నాయక బాణములకు
ననిశ మక్షయ తూణీరమై చెలంగు
నట్టి నాబుద్ధి నిప్పుడే నాశ్రయింతు
నదె యమోఘముగా విజయంబు నమరఁ జేయు. 7

[అంతట పుళిందరాజగు నింద్రదత్తుఁడు చంద్రహాసుఁడుఁ బ్రవేశించుచున్నారు.]

మంత్రి—మిత్రమా! ఇంద్రదత్తా! మాకు నీవు మరువరాని యుపచారములఁ జేసితివి. చాలు చాలు! మంత్రినైన నాకుంగూడ నే నిట్టి సన్మాన మెన్నఁడు బొందియెఱుఁగ. నాకే గాదు. కుంతలేంద్రునకైన నిట్టి సన్మాన మెన్నఁడు జరిగియుండదు. నీకుమారుఁడు చంద్రహాసుఁడు నీవును నా విషయమునఁ బడిన శ్రమకు నేను మీ ఋణ మెప్పటికిం దీర్పఁజాలను.

చంద్ర—దేవా! మా మీఁది దయచేత మీరు సంతుష్టులు కాఁగలవారైతిరిగాని మా సపర్యలవలనఁ గాదు.

తే. గీ. నరులు దేవతార్చనాకాల మందు నెపుడు
నతఁడు సృజియించు పూవులే యతనికిత్తు
రట్లె మును మీరు మాకిచ్చి నట్టి సిరుల
మరల నర్పించితిమిగాక మాదికలదె. 8

ఇంద్ర—మీరు మాయెడఁగల యనుగ్రహముచేత నణుమాత్రమైన మా యుపచారము మహామేరువట్లగపడుచున్నది. ఈ యనుగ్రహమే యింకముందును మాపైఁ జూపవలయునని వేఁడుచున్నాను. నన్నుం బెంచిన మీ చల్లని చూపులే చంద్రహాసుని మీఁదఁగూడఁ బ్రసరించుగాక!

మ. ఇతఁడే యూఁతగ ప్రాణమై వెలయు నా; కితఁడె నా వంశ సం
తతి నెల్లప్పుడు ధాత్రి నిల్పెడు నిదానం; బీతఁడే నాదు దుః
ఖతమఃపుంజము బాపు భాస్కరుఁడు; నాకందోయి జాబిల్లి నా
వ్రతము ల్పండిన పంట; నాదుకులదీపం బో సుహృద్రత్నమా! 9

మంత్రి—ఇతఁడే నీమనోరథంబని నే నెఱుంగుదు. నీవును నాకును శరీరం బులు భేదంబులుగాని యాత్మ యొక్కటే కదా! అందుచేత నాకును నీ పుత్త్రుం డాఁడున ప్రాణమే. నీవు మిక్కిలి యదృష్టవంతుఁడవు. చంద్రహాసునివంటి కొడు కెంతయదృష్టవంతునకు లభించును? చూడు.

సీ. నిరుపమానం బగునిజభుజాబలముచే మస్తరించినవాఁడు మన్నెదొరల
జనసమ్మతం బైనసత్పాలనముచేత విస్తరించినవాఁడు విమలయశము
క్రూరభూపాలనిర్మూలనం బొనరించి కుస్తరించినవాఁడు శ్రీవాణిదేవిఁ
చనవర్తనముచేత ధారుణీజనులందుఁ బ్రస్తరించినవాఁడు రాజభక్తి
నిస్తరించినవాఁడు నిద్రశక్తి
వైరికీనాసముద్రంబు పార్థివేంద్ర
వన్నె కెక్కెను గోవిందవంశ మిపుడు
కొడుకు కనఁగ నిశ్చయముగ నీకొడుకె కొడుకు.                    11

ఇంద్ర—మిత్త్రమా! నీయనుగ్రహాశీర్వాదములె వీని నింతవానిఁ జేసినవి.

మంత్రి—ఇంద్రసేనా! ఇతఁడు నీకుఁ బడుచువాఁడుగ నొక్కెడ వనాంతరమున లభించెనుగదా!

ఇంద్ర—ఔను! అరణ్యమున నర్ధరాత్రమున నిక్షేపమువలె నీతఁడు దొరకెను.

మంత్రి—చంద్రహాసా! ఆయరణ్యమునకు నిన్నుఁ దోడ్కొనిపోయి హింసించిన వా రెవ్వరో యెఱుఁగుదువా?

చంద్ర—అయ్యా! ఆవిషయము నా కంతగా జ్ఞాపకము లేదు. ఎవరో బాధించినట్లు నే నేడ్చినట్లు నన్నొయన లీసికొనిపోయినట్లు స్వల్పముగ జ్ఞాపక మున్నది.

మంత్రి—మిత్త్రమ! ప్రపంచమున నెంతటిదురాత్ములైన నుందురు. వికసించని పువ్వువోలె జ్ఞానసముద్భవము లేనివాని ముద్దులు మూటగట్టుసుకుమారుని నాలుగేండ్ల యర్భకుని నట్టడవిలో హింసింపఁ బంపినవారును హింసింప వచ్చినవారును బెబ్బులి హృదయములుగల వింతమానవులో రాక్షసులో గాని సామాన్యమానవులు గారు.

ఇంద్ర—మిత్త్రమ! ఇతనిని వా రేల హింసింపఁ దలఁచిరో కారణ మూహింపఁ జాలకున్నాను. ఇతనికడ నగలు లేవు. నాణెములు లేవు.

మంత్రి—ఆదురాత్ములు తమదుష్ప్రారంభములు కొనసాగుటకై యేక్షుద్రదేవత కయిన నరబలి యిచ్చుటకై మొక్కుకొని యీబాలుని సర్పింపఁ దలఁచిరేమొ.

ఇంద్ర—అయి యుండవచ్చును. కాని వా రభీష్టసిద్ధి యేల చేసికొనలేదో?

మంత్రి—అత్యద్భుతసౌకుమార్యము చక్కఁదనము జూచి రక్షకులైన దురాత్ములమనసులు కరఁగెనేమో !

ఇంద్ర—అట్లే తప్పక యైయుండవచ్చును. ఆహంతలలో నెవఁడో జాలిగుండె వాఁ డుండియుండును.

మంత్రి—(తనలో) నామీఁద వీరి కించుకైనను ననుమానము లేదు. ఈబాలకుఁడు కుంతలంబున నుండుటే యెవరికిం దెలియదు. వీఁడు నన్నానవాలు పట్టఁజాలఁడు. ఇంక నావల పన్ని యీచిఱుచేఁపం బట్టవచ్చును. (ప్రకాశముగ) అట్టి గొప్ప గండము చిన్ననాఁట గడచినందున నితఁడు చిరంజీవి యై పుళిందరాజకులపారావార పార్వణచంద్రుఁడై కుశలయానందప్రదాయకుఁడై సత్పథవర్తి యై వర్ధిల్లుఁగాత !

ఇంద్ర—అమాత్యభాగురాయణునియాశీర్వాద మమోఘ మగుఁగాక !

చంద్ర—మీయనుగ్రహపాత్ర మైతిని గావున నేను ధన్యుఁడను.

మంత్రి—నీ వింకను ధన్యుఁడ వయ్యెదవు.

ఇంద్ర—మిత్రమ ! అది యెట్లు ?

మంత్రి—రాజా ! కుంతలేశ్వరుఁడు భుజబలతులితకుమారుం డగునీకుమారుని చక్కఁదనంబును శౌర్యగాంభీర్యాదిగుణగణంబును శ్రవణానందముగ విని మానవతీపర్యాయమన్మథుఁ డగునాతనిమూర్తిం గని శ్రవణంబులవలెనే నేత్రంబులనుగూడ ధన్యములు చేసికొనవలె నని తలంచి చంద్రహాసుం దనకడకుఁ బంపు మని నొక్కి వక్కాణించె. ఒక్కనిముసమైన మన మాలస్యము చేయరాదు. చంద్రహాసు నెపుడు చూతు నెపుడు చూతు నని యమ్మహీశునిహృదయము తత్తఱపడుచున్నది.

ఇంద్ర—అమాత్యా! నీవు వెండియుఁ గుంతలంబునకుఁ బోవునప్పుడు వీనిని నీ వెంటఁ గొనిపోవచ్చును.

మంత్రి—అట్లు కాదు. నే నింతలోఁ గుంతలంబున కరుగను. క్రొత్తగా నీకొడుకుచే నిర్జితులైనమన్నెదొరలను బిలిపించి యేకముగ వారు కుంతలేంద్రునకుఁ గ్రమముగఁ గప్పంబులు గట్టి బుద్ధిమంతులై యుండునట్లొడంబఱచికొని యిచ్చోటు విడువను. మహారాజుగారిమనస్సీయాలస్యమున కోర్వదు. ఈక్షణమున నీకుమారుఁ డరుగవలయు. రాజులచిత్తవృత్తులు నీ వెఱుఁగవా ! తలఁచినప్పుడే కార్యంబులు కావలయు నని వారు కోరుదురు గదా ! రాజుమనస్సు వర్షకాలనిశాసమయచంద్రమండలమట్లు క్షణ మాగ్రహావేశపూర్ణమై యుత్తరక్షణమునఁ బ్రసన్నమై చల్లఁదనము వెదజల్లుచుండును.

ఆ. వె. అవనినాథునాజ్ఞ యనియెడు సుడిగాలి
యెట్లు త్రిప్పి కొట్టు నట్లె తిరుగ
వలసినట్టియల్పవస్తువులే సుమీ
మాదృశు లగుబంట్లు మాట లేల. 12

కావున జనియాజ్ఞ యవిలంఘనీయము. ఇప్పుడె పయనము చేసి నీకొడుకు నంపుము.

ఇంద్ర—అయ్యో! ఇతనిఁ బాసి నే నొక్కనిముసమైన నుండఁ జాల. తల్లి యరనిముసమైన నీతనివియోగము సహింపదు. కావున నేనును నాభార్యయు వీనిని వెంటఁ బెట్టుకొని యరుగున ట్లనుగ్రహింపుము.

మంత్రి—ఇంద్రదత్తా! ఎంత వెలవు! తలిదండ్రులు వెంటఁ గొనిపోవుటకు నీకు మారుఁడు స్తన్యపానము సేయుశిశువు గాఁడు. అభ్యస్తసమస్తశస్త్రనిక్షాయుఁడు, పండితారాతిమండలుఁడు, సకలవిద్యాపారంగతుఁడు నగుప్రౌఢ; వానినిమిత్త మింత విచారించెద వేల? రాజదర్శనముఁ జేసి నాల్గుదినములలో మరల నీకడకు వచ్చును. చూడు—

సీ. నీకుమారుఁడు భూప! యాకుమారుఁడె సుమీ సాహసంబులచేత శక్తిచేత
నీకుమారుండు రమాకుమారుఁడు సుమీ సుకుమారతలచేత సొగసుచేత
నీకుమారుఁడు యశోదాకుమారుఁడు సుమీ విన్నాణములచేత విద్దెచేత
నీకుమారుఁడు నృపా నాకుమారుఁడుసుమీ మనబంధములచేత మైత్రిచేత
జంకుఁ బొంద నేల సందియం పడ నేల
రాజునొద్దఁ గడుసురక్షితుండు
నీతనూభవుండు నృపదర్శనముఁ జేసి
చెక్కుచెదరకుండఁ జేరు నిటకు. 13

కావలయు నేని గొంతపరివార మిచ్చి పంపుము.

ఇంద్ర—ఇంతనిరవకాశంబుగా మహారాజుగారికి బాలకుం జూడవలసినయవసరమేమి గలిగెనో?

మంత్రి—అది నే నెట్లెఱుఁగుదును? రాజాజ్ఞ. నేను రాజాజ్ఞావాహుఁడనని మాత్రమే యెఱుఁగుము. నీకుమారుం జూచుటకే యని నేఁ దలంచెద. ఈసందర్శనము చేత నీకుమారున కేమికల్యాణములు చేకూరునో యెవరు చెప్పఁగలరు! తొల్లి దశరథుఁడు గారాబుకొడుకు లైనరామలక్ష్మణులను గాధేయుని వెంట నంపుట కెంతయు సంశయించెను. కాని, తుదకు వారినిర్గమన మెంతశుభహేతు వయ్యెనో యెఱుఁగవా? (తనలో) మరణమే వీనికి రాఁగలకల్యాణము. విధిలేక వీని నాశీర్వదించి శుభములగునని చెప్పవలసె.

చంద్ర—(తనలో) నాయనగారు నిర్హేతుకముగ విషాదాయత్తచిత్తులగుచున్నారు. వారు సెల విచ్చినచో ననాయాసమునకుఁ బోయి వత్తు.

ఇంద్ర—అమాత్యా!

చ. ఎఱుఁగుదు నాకుమారకుఁ డక్షీణభుజాబలగర్వితుం డటం
చెఱుఁగుదుఁ గుంతలేంద్రుకడ నెట్టియపాయముఁ బుట్ట దంచు ని
ట్లెఱిఁగియుఁ బ్రేమబంధ మొకయించుకయే న్నడలింపలేక యి
ట్లెటిమతి నొందఁ జొచ్చె మది యక్కట దుస్సహముల్ వియోగముల్. 14

మఱియు—

తే. గీ. నాదుగృహదీప మైనయీనందనుండు
గృహము నెడఁబాసి యున్న నయ్యహములందు
నెవెలుంగులదోఁగ మింట వెలుఁగుచున్నఁ
జిమ్మచీఁకటుల్ నాయిలు గ్రమ్మి యుండు. 15

మంత్రి—ఇంద్రదత్తా! ఏమి యీమోహము! ప్రపంచమునఁ గుమారుఁడు నీ కొక్కనికే లేఁడు. మేమును బుత్రవంతులమే. పుత్రస్నేహ మెట్టిదియొ మేమును గొండొక యెఱుఁగుదుము. నాకుమారుని రూపజితమదనుని మదనుని విడచి యడవులు కొండలు నేరులు దాఁటి యింతదవ్వు నేను రాలేదా? మేము పుత్రప్రేమ లేనివారమా? నీ వొక్కఁడవే పుత్రప్రేమచవి నెఱిఁగినవాఁడవు? రాజకార్యపరతంత్రు లైనప్పుడు దారపుత్రులను విడచి చిరకాల ముండవలసివచ్చు. ఆలుబిడ్డలం గౌఁగిలించుకొని యింట నుండుట కాపురుషలక్షణము గాని యుదాత్తపురుషలక్షణము గాదు. ఒకానొకప్పుడు ప్రియబంధువులతో మనకు శాశ్వతవియోగమే సంభవింపవచ్చును. బంధుసంయోగవియోగములు సూర్యచంద్రోదయాస్తమయములవలెఁ గలుగుచుండును. బంధుసమాగమమున సంతోషమును వియోగమున విషాదము నొందుట వీరపురుషోచితము గాదు. కావున వెండియు వితండవాదము లేక కుమారుని బయనము సేయుము. చంద్రహాసా! రాజసైన్యమున కరుగుట నీ కిష్టమా?

చంద్ర—నాయనగారి సెల వయ్యెనేని నే ననాయాసమునకుఁ బోయి వచ్చెద.

మంత్రి—అట్లైన నిటు వినుము. కతిపయపరివారమును వెంటఁగొని కుంతలంబున కరిగి ముందుగ నాకుమారుఁ డగుమదనుం జూడుము. ఇదే నాకుమారునకు నేను వ్రాసినజాబు. ఈజాబతని కిమ్ము. ఈలేఖం జూచికొని యాతఁడు నీ కుచితసత్కారం గావించి రాజదర్శనంబుఁ జేయించు. నాఁటిట నీవు స్వర్గంబునం దున్నట్లుండుదువు. ఈవల ధ్యాన్నమై పయనమై పోవలయును.

అందుచేత నితనిని విశ్వసింపరాదు. ఏలయన,

సీ. మెసవువంటకమందు విసము వెట్టించును నిప్పులు దరికొల్పు నిలయములకుఁ
గ్రూరహంతలచేతఁ గుత్తుకఁ గోయించు నిద్రలోఁ ద్రోయించు నీటియందు
దారులు గొట్టించు దండిదొంగలచేతఁ బాఁతుపెట్టించును బ్రతికియుండ
గొప్పనేరము లెంచి కొరత నేయించును జిచ్చునఁ బడఁ ద్రొబ్బు జీవ ముండ
నితఁడు సేయనిపనులు లే వెందుఁ, గాన
గుడుచువేళల నిం దాదు నడచువేళ
నిదురవోయెడువేళల నిలుచువేళ
మిగుల జాగరూకుఁడ వై మెలఁగుమన్న. 20

చంద్ర—ఇతఁ డపకారము చేయు నని నీ కేల యనుమానము గలుగవలయు!

ఇంద్ర—అతనిహృదయమున నే మున్నదో మన మెఱుఁగఁ జాలము. అతనిపూర్వచరిత్రమే యనుమానకారణము.

చంద్ర—నేను మిక్కిలి జాగరూకుఁడనై యుండెద. నాకు సెల విమ్ము.

ఇంద్ర—(కౌఁగిలించుకొని) నాయనా! దేవతలు, గృహదేవతలు, భూదేవతలు, నిన్ను రక్షింతురుగాక !

తే. గీ. నీదుచిఱునవ్వుపేరి వెన్నెలలు లేని
నాఁడు ఘోరకాంతారంబు నాగృహంబు
తేనె లొలుకునీపలుకులు లేనినాఁడు
చిలుక లేనిపంజర మిల్లు చిన్నియన్న. 21

చంద్ర—అంతిపురమున కరిగి యమ్మగారితోఁ జెప్పి పోయెద.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

## రంగము 2

### మంత్రివిడిదియిల్లు.

---

[అప్పుడు మంత్రియు సేనాపతి యగునుగ్రసేనుఁడును బ్రవేశించుచున్నారు]

మంత్రి—ఉగ్రసేనా ! ఇంద్రదత్తుఁ డిప్పుడు వచ్చునా? జాముౘత్రి యైనతరువాత రమ్మని పనుచుటచేత నేదో నెపము పన్ని యిప్పుడు రాక రేపుదయమున వత్తునని వర్తమాన మంపునా?

ఉగ్ర—అమాత్యభాగురాయణునియాజ్ఞ నుల్లంఘించుట కెబ్బనినోటఁ దలదూ

ర్చుట యని యతఁ డెఱుఁగఁడా? కుబుసము మూడ్చినకోడెత్రాఁచు నెవ్వఁడు మెడఁ దాల్చును ?

మంత్రి—ఔను! మందబుద్ధి యై యిప్పు డతఁడు రానియెడల,

తే. గీ. భస్మపటలంబు గావింతుఁ బట్టణంబుఁ
గోట నేలమట్టము జేతు గ్రూఁటలోఁజఁ
బౌర లందఱ నఱకింతుఁ బగవసముసఁ
జర్మ మొలిపింతు నీచనిజనను లడల. 22

ఉగ్ర—ఈపాటికి బయలుదేరి వచ్చుచుండును.

మంత్రి—ఉగ్రసేనా! అతఁడు వచ్చినతోడనే నీ వెదుర్కొని సగౌరవముగఁ బీఠమున నాసీనుం జేసి యేదో నెపమున నతనిచేతిఖడ్గముం దీసికొనవలయును. కోఱ లూడిన పామువలె నాయుధహీనుఁడు శూరుఁ డయ్యు విక్రమింపలేఁడు. ఆయుధ మూడఁ జెఱికినతరువాత నే నొకసన్నఁ జేసెద. అది యానవాలుగ మసగదులలోఁ డాగి యుండు జోదు లాతనిపైఁబడి బంధింపవలయును. జోదులతో నీ వట్లు చెప్పి యెక్కడ నుండవలసినవా రక్కడ నుండఁ బనిచితివా ?

ఉగ్ర—ఆహా! దేవరవారియాజ్ఞాప్రకారము సకలప్రయత్నములం జేసితి. సైనికు లీరాత్రి నిదురవోవకుండ నాయుధపాణులై యుండునట్లు శాసించితి.

మంత్రి—ఇంద్రదత్తుఁ డిక్కడ బద్ధుఁడు కాఁగానే నాసంరక్షణము నిమిత్తము నీ విక్కడఁ గొంతసేనను నిలిపి తక్కినసైన్యముతో నీవు కోటఁ జొచ్చి యంతిపురంబు ధనాగారము ముందుగా దోఁచుకొని పిమ్మట నగర మంతయుఁ గొల్ల వెట్టవలయును. ఒక్క పూరిపుల్ల యైన మిగులకుండ ద్రవ్య మంతయు దోఁచి తెమ్ము. దయాదాక్షిణ్యములు లేక మీపని కడ్డువచ్చినవారిని శిశువు లనక స్త్రీ లనక బాలు రనక వృద్ధు లనక మీని శితకరవాలముల కెరఁ జేయుఁడు. జాలి దుర్బలలక్షణము. ఇంద్రదత్తునిరాణి యైనమేధావినినిగూడ మీ రించుకేనియు గౌరవింపక యామె మేనఁ దాల్చిననగలుగూడ దోఁచికొని రావలయును. ధనరాసుల నతఁడు భూమిలోఁ బాఁతుపెట్టినయెడలఁ బాఁతును జూపవలసిన దని దాసదాసీజనంబులం బట్టి యడుగుఁడు. వా రవి చూపకున్న దంతంబులం గొట్టియు శూలంబులం బొడిచియు వేఁడిచమురు మేనఁ బోసియు నాముదమునం దడిపినగుడ్డలు కాలుసేతులకుం జుట్టి నిప్పు దరికొల్పియు నానావిధచిత్రహింసలు చేసి వారివలన నిక్షేపంబు లున్నస్థానంబు లఱసి గోతులు త్రవ్వి పాఁతులు వెల్లగించి యర్థంబు గ్రహింపుఁడు, వా రెంతకుం జెప్పకున్న వారిం జంపి యి ల్లంతయుం ద్రవ్వఁ

డు. పిమ్మట నగరమంతయుఁ గొల్లపెట్టుఁడు. నగరముఁ గొల్లపెట్టుట కిదియే మంచిసమయము. పగలు కొల్లపెట్టినపక్షమున జనులు జాగ్రత్తపడి తమయర్థంబులు దాఁచుకొందురు.

ఉగ్ర—మీయాజ్ఞ నట్లు గాల జరిగెద.

తే. గీ. బంతులట్లు పౌరులతలల్ గంతు లిడఁగ
ననఁటిబొందలక్రియ నరు లవనిఁ గూలఁ
బచ్చినెత్తురు వర్షంబుపగిదిఁ గురియఁ
జూచి యీయుగ్రసేను మెచ్చుదువు నీవు. 23

మంత్రి—పౌళిందుఁ డొంటిగ రాక కొంతపరివారమును వెంటఁ బెట్టుకొని సేనాపతి సమేతుఁడై వచ్చు నని తోఁచెడిని.

ఉగ్ర—ఏకాన్తమున నిరువురి కైదువులు దీసికొని యిరువుర నొక్క తెఱఁగుననే జేయుదము.

మంత్రి—(తనలో) ఇప్పు డొకసారి యుగ్రసేనుని రాజ్యాశాపాశములచేత బంధించి యుబ్బఁ జేయఁగలము. (ప్రకాశముగ) ఉగ్రసేన! ఈప్రయత్న మంతయు నీపట్టాభిషేకమహోత్సవమునకుఁ జేయు జతనములు సుమీ!

ఉ. ఎంతయదృష్టవంతుఁడవొ హీనకులుం డగునింద్రదత్తభూ
కాంతుఁ, బుళిందరాజ్యరమ గాఢముగా మదిలోన గోసి దు
ర్దాంతభుజద్వయార్గళపరాజితవైరిమహీధవ్రజన్ సమా
కాంతపదాబ్జషట్పదు నినుఁ గాంతునిఁగా వరియించె వత్సలన్.

సిరి గ్రుడ్డి దగుటచేత నిట్టిమందప్రజ్ఞుని వరియించె. ఇది యామెకుఁ బ్రాయికమె.

క. వరియించున్ గులహీనుని
వరియించున్ గుణవిహీను వరియించును దు
ష్టురునిన్ భీరునిఁ గ్రూరుని
సిరి గ్రుడ్డిది గాకయున్నఁ జేయునె యిట్టుల్ 25

[అట్లమున కామె గుణవంతునిఁ గూర్చి మేలుపడుచున్నది. నీయదృష్టముచేత,

తే. గీ. తనువు నొవ్వకుండ ధనువుఁ దాల్పకయుండ
సాయకంబుఁ దొడిగి యేయకుండఁ
జెక్కు చెదరకుండఁ జెలువంబు చెడకుండ
నక్లేశమున రాజ్య మబ్బె నీకు. 26

ఉగ్ర—అయ్యా! రాజ్యలక్ష్మీపాణిగ్రహణమునకుఁగాని విషయాకరపీడనమునకుఁగాని మీయనుగ్రహమే కారణము.

మంత్రి—ఇంద్రదత్తబంధనము, ధనసంచయగ్రహణముఁ జేసి కృతకృత్యుఁడనై కతిపయదినములలో నేను రాజసన్నిధి కరిగెదను. నీ విచ్చటనే యుండి పుళిందదేశముఁ బరిపాలించుచుండుము. మీఁద నెల్లశుభములు రాఁగలవు.

[అపుడు కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—దేవా! జయము. జయము. సేనాపతిసమన్వితుఁడై పుళిందరాజు వచ్చియున్నాఁడు.

మంత్రి—యథోచితముగాఁ బ్రవేశపెట్టుము.

కంచు—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

మంత్రి—ఉగ్రసేన! ఆయుధహీనుం జేయుటకు సామవాక్యములే ప్రయోగింపవలయునుసుమా!

తే॥ గీ॥ మృదుకచోగుంభనలచేత మెత్తబఱచి
పిదప బంధింపవలయు నీపృథివిపతిని,
మొదల నాగస్వరం బూఁది బుజ్జగించి
యవల నహితుండికుఁడు పాము నడఁచుఁ గాదె. 27

[అపుడింద్రదత్తుఁడు నతని సేనాపతి యగు వజ్రబాహుఁడును బ్రవేశించుచున్నారు.]

ఉగ్ర—పుళిందరాజునకు స్వాగతము!

ఇంద్ర—అమాత్యభాగురాయణున కభివాదనము సేయుచున్నాను.

వజ్ర—మీయుభయులకు విజయ మగుఁగాక!

మంత్రి—రాత్రి ప్రొద్దు పోయినపిదప నిన్ను రావించి నిద్రాభంగముఁ గలిగించుట నాకు విచారకరముగా నున్నది.

ఇంద్ర—కుంతలసార్వభౌమ మహామంత్రి యగు నమాత్యభాగురాయణుఁడే నిద్రఁ గోల్పోయినప్పుడు నానిద్రాభంగ మెంత!

వజ్ర—రాజకార్యములు నిద్రం దవ్వుగఁ దోలును.

ఇంద్ర—విచ్చుకత్తులు బూని మందిరంబుల రక్షించువీరభటులం జూచి నిద్రాదేవత జడిసి పాఱిపోయి రమ్మని యాదరంబునం బిలుచువఱకు రాదు.

ఉగ్ర—కత్తు లనుటచేత జ్ఞప్తికి వచ్చినది. చందనావతీపురమునఁ గత్తులు మిక్కిలి ప్రశస్తమైనవి జేయుదురఁట నిజమా?

వజ్ర—రాజధాని యగు కుంతలపురంబున నున్న పనివాండ్రకంటె మాచందనావతి యందెక్కువ నేర్పరులు లేరుగాని మంచికత్తులు చేయువారు గలరు.

ఉగ్రః—నాకును నమాత్యభాగురాయణునకును జెఱియొకకత్తి గావలెను. చేయింపఁగలరా ?

వజ్ర—ఆహా ! మేము చేయించెడిదేమి ! మీయాజ్ఞయే చేయించును.

మంత్రి—చేయించుట కాలస్య మగు నేమో ?

ఇంద్ర—అట్లయిన మాయిరువురకత్తులు మీరు కానుకగా గ్రహింపుఁడు. మేము క్రొత్తవి మరలఁ జేయించుకొనియెదము.

మంత్రి—అయ్యో ! మీకు హస్తాలంకారములై యరాతిప్రాణానల కాలభుజంగములై రత్నఖచితములై యత్యంతప్రియములైన ఖడ్గములను మీహస్తములనుండి గ్రహించుట మీకుఁ గష్టముగా నుండు నేమో యని సందేహించుచున్నాను.

ఉగ్ర—అట్టిసందేహములు మీయెడల వారి కుండవు.

ఇంద్ర—పరమసంతోషమున నాఖడ్గము నమాత్యభాగురాయణునకు సమర్పించుచున్నాఁడను.

వజ్ర—కుంతలసేనాపతికి నాకరవాల మిదె కానుకగా నిచ్చుచున్నాఁడను.

మంత్రి—ఇంద్రదత్త! ఈఖడ్గము మనమనోమాలిన్యములను ఛేదించుఁగాక.

ఇంద్ర—అవి యిప్పుడు లేవు. ముందుఁ బుట్టవు.

మంత్రి—ఉగ్రసేన ! ఈరెండుఖడ్గముల నతిశ్రద్ధతో నీవు సంరక్షింపుము. కుంతలమున కరిగినపిదప నాఖడ్గము నాకప్పగింపుము.

ఉగ్ర—చిత్తము.(అని ఖడ్గములదాఁచుచున్నాఁడు.)

ఇంద్ర—మిత్రమ ! రేయి యింత ప్రొద్దుపోయినపిదప నన్ను రావించినకారణ మేమి ?

మంత్రి—మహారాజుగారు కొన్నివిషయములు నిన్నడిగి వానికి నీ వేమిప్రత్యుత్తర మిచ్చెదవో తెలిసికొని రమ్మనెను. అవి పరమరహస్యములు. అన్యులు వినఁ దగినవి కావు.

వజ్ర—దేవా ! నే నావలకుఁ బోయెదను.

ఉగ్ర—దేవరవారిసెల వైనప్పుడు వచ్చెద. (అని యిరువురు నిష్క్రమింతురు.)

ఇంద్ర—మహారాజుగారిపలుకులు వినఁ గోరుచున్నాఁడ.

మంత్రి—ఇంద్రదత్త! కొంతకాలమునుండి కుంతలసార్వభౌమునియెడ నీవక్రతనము బెఱుభఁగిగా నున్న దని మహారాజుగారికే తోఁచినది. అగర్వము నీకుఁ దగునా !

మ. నిను లోకం బెటువంటిధన్యుఁ డనినన్ నీ కెంతయైశ్వర్య ముం

డిన నీకందనుఁ డెంతవాఁ డయినన్ నీ వెంతసత్కీర్తిఁ గాం

చిన సామంతనృపాలకుండవె గదా శ్రీకుంతలక్షోణినా
థున కారాజును బూరికైనఁ గొన వీద్రోహంబు సామాన్యమే!

ఇంద్ర—(ఆశ్చర్యముతో) మిత్రమ! ఎంతమాట! నేను మహారాజును బూరికైనఁ గొనుటలేదా? మనోవాక్కాయకర్మముల నే నెన్నఁడు సార్వభౌమునియెడ ద్రోహముఁ దలఁపలేదు. దుష్టనరసర్పములు తనిచెవిచెంతఁ జేరి కొండెపువిసము బోసియుండుటచేత మహారాజుగారిమన స్సట్లు జెడియుండవచ్చును. ఆమహారాజుమనస్సు వక్రమైనప్పుడు నీవైన దానిని సరిజేయవలదె?

ఉ. కుంతలరాజపుంగవునకుక్ సరిగా నరిగాపు లైనసా
మంతనృపాలకుల్ గలరు మాన్యు లనేకులు, వారిలోన నే
నెంతటిభక్తియుక్తుఁడనొ యెంతవిధేయుఁడనో వసుంధరా
కాంతుఁ డెఱుంగఁడొక్కొ చిరకాలపుమంత్రివి నీ వెఱుంగవో.

మంత్రి—నీయవిధేయతకు నిదర్శనములు గనఁబడుచుండఁగా నేను మహారాజుతో నీపక్షమున నేమని మనవి జేయుదును?

ఇంద్ర—అట్లైన నానిదర్శనము లేవో వినఁ గోరుచున్నాఁడ.

మంత్రి—అందు మొదటి దిది—నీవలెనే సామంతులై విధేయులైన యాటవికరాజులను మహారాజుగారియాజ్ఞ బడయకుండ బాధించితివి.

మ. అరిగాపుల్ చిరకాలమిత్రులును నూతనామగర్మముల్ లేనిపా
మరు లాభాగ్యవిహీను లాజడులఁ గొంపల్ దోఁచియుం గాల్చియుక్
హరిణంబుల్వలె వేఁటలాడియును నీ వంతంబు నొందించి తె
వ్వరు ని న్నాపని సేయఁగాఁ బనిచిరో వారుమ్మవ్విమీ యుత్తమిన్.

ఇంద్ర—ఇంతేగదా నా నేరము?

మంత్రి—మఱి యొండు గలదు విను—

మ. అవనీనాథుఁ డెఱుంగకుండఁగ రహస్యప్రక్రియక్ బెంచుకొం
టివి నీ వొక్క కుమారుఁ బూర్వపరిపాటిం దప్పి యు ట్లేల జే
యవలెక్ గుంతలభూమిపాలకుఁ డనూయాగ్రస్తుఁ డై నీతనూ
భవునిక్ గారియు వెట్టు నంచు మదిలో భావించితేఁ జెప్పుమా.

ఇంద్ర—అయ్యా! నావిన్నపముఁ జిత్తగింపుఁడు. కొండరాజులు నాచిన్ననాటనుండియు మీరాజ్యపుసరిహద్దులలో నుండి సామంతనృపాలకులదేశంబులం బడి గృహారామక్షేత్రంబులు దోఁచుకొని ప్రజలకుఁ గలిగించినయలజడి యింతింత యనరాదుగదా! ఈవిషయములు సామంతరాజులు మీకు విన్నవింప మీరు పలుమారు లాకొం

ఈదొరమూఁకలను మీయిచ్ఛవచ్చినతెఱంగున మర్దించి బుద్ధి సెప్పి కుంతలేంద్రునకు విధేయులుగఁ జేయుఁ డని నాతో స్వయముగాఁ జెప్పుటయే గాక యెన్నో సారులు వర్తమాన మంపిరి. మ రొక్కసారి కుంతలసైన్యంబుల వారిపైకి మీరు పంపితిరి గాని యాసేనలు కొండదొరలదాడి కోర్వలేక పరాజయము నొందెను. ఆమాట మీ రెఱుఁగనిది కాదు. ఆదురాత్ములు గావించుపీడలు సహింపలేక మున్ను మీరు పలుసారులు వారిని దండింపవలసిన దని చెప్పియుండుటచే మేము వారిపొగ రడంచి వారివలన మేము గ్రహించినయర్థంబుల మీకును గానికగా నంపితిని. ఈయాటవికులం గెలిచి కుంతలేంద్రునకు మేము మహోపకారముఁ జేసితిమి గాని యపకారముఁ జేయలేదు. ఆదురాత్ములు మాయామర్మములు లేనిమూర్ఖు లని మీ రిప్పుడు జాలినొందుచుండిరి గాని వారు గావించుదుర్నయంబులు గన్నులారఁ జూచిన మీ రిట్లనరు. వారు నేల మంగలంబునం బెట్టి వేఁచిరి. రాచబాట లరికట్టిరి. స్త్రీలం జెఱఁ బెట్టిరి. వారిచేఁ జిక్కినమందభాగ్యులను వారు దేవతలకు బలియొసంగిరి. ఇండ్లు దోఁచికొని కాల్చిరి. ఇండ్లు దోఁచుకొన్నప్పుడు ద్రవ్యముఁ జూపు మని గృహయజమానులను జిత్రహింసలు జేసి వారికట్టెదుట వారిపసిబిడ్డలను దుత్తునియలుగా నఱికియుఁ జిచ్చునం బడవైచియు నతిఘోరకృత్యములు జేసిరి. అట్టిదుష్టులు మీమెప్పులకు మీప్రశంసలకుఁ బాత్రము లగుట నాకు మిక్కిలి యక్కజముఁ గలిగించుచున్నది. ఇంక నాపుత్రస్వీకారవిషయమై యొక్కమాట చెప్పెదను. సామంతనృపాలకులు పుత్త్రస్వీకృతిఁ జేసికొన్నప్పుడు సార్వభౌముని యనుజ్ఞఁ బడయుట యాచారము గాదు. నే నొక్కఁడనె గాదు. ఇదివఱ కెందఱో సామంతులు కొడుకులం బెంచుకొనిరి. వారు మీయనుజ్ఞఁ బడయలేదు. ఏల బడయలే దని మీ రడుగలేదు. ఈధర్మసూత్రములు నానిమిత్తమై నిర్మింపఁబడిన వని తోఁచుచున్నది.

మంత్రి—ఏమేమీ ! కుంతలసార్వభౌమునకు నీవు మహోపకారముఁ జేసితివిగా! నీవంటిమందప్రజ్ఞునిసహాయ మపేక్షించుటకు మహారాజంత దుర్బలస్థితిలో లేఁడు. పరితాపలవదుర్విదగ్ధుం డగుచంద్రహాసకుమారునిం జూచియు శౌర్యహీనులైనయాటవికరాజులం జంపి పడసినవిజయంబులం దలంచియు గర్వోన్మత్తచిత్తుండవై నీయంతరమును సార్వభౌమునియంతరమును నెఱుంగక యథేచ్ఛముగఁ బల్కుచున్నవాఁడవు. పుత్రస్వీకారసమయమున రాజాజ్ఞఁ బడయుట యాచారము కాదో? ఈధర్మసూత్రములు నీనిమిత్తమె నిర్మించితిమా ? ఉగ్రసేనా ! చూచెద వేమి ?

[అపు డుగ్రసేనుఁడు భటులుఁ బ్రవేశించుచున్నారు.]

ఉగ్ర—ఇంద్రదత్త! నీ విప్లవము చెఱలో నున్నవాఁడ వని తెలిసికొనుము.

[కొందఱు భటు లింద్రదత్తునిచేతులు వెనుకకుఁ గట్టుచున్నారు]

ఇంద్ర—నన్నేల మీరు చెఱఁ బెట్టుచున్నారు?

మంత్రి—రాజద్రోహమునకు.

ఇంద్ర—రాజద్రోహమా! అది మాయింటివక్క కయింటను లేదు. మహారాజులకడ మంత్రుల మనుపేరు వెట్టుకొని దుస్తంత్రంబులం బన్ని యా నృపాలసింహముల నిజమాయావాగురలం బడఁద్రోచి వారిమనస్సులు విఱిచి ప్రజలకును వారికిని విరోధములు గల్పించి దేశమునందు శాంతి నెలకొల్పుటకు మాఱు నలజడిఁ గలిగించునట్టి దుష్టపరిపాలకులే రాజద్రోహులును, దేశద్రోహులు నగుదురు గాని మావంటివారు గారు.

మంత్రి—ఏమీ! మేమే రాజద్రోహులమా? జాగ్రత్త! నాలుకఁ గోయించి తలఁ ద్రెవ్వ వేయించి, చేతులు ఖండించి చిత్రవధ జేయించెద.

ఇంద్ర—ఇది నీకుఁ గ్రొత్తపని కాదు. పరమేష్ఠి విషూచిమశూచిమొదలగు మహావ్యాధులను సృజించినట్లే జననాశనమునకై యొకానొకప్పుడు నీవంటిదురాచారులను గూడ సృజించుచుండును. నీచిత్రవధలు మాకు భయజనకములు గావు. ఏలయన.—

మ. నినుఁ గొండాడినపాతకంబునకు ఖండింపం దగుఁ నాల్క, నీ
కు నమస్కార మొనర్చుదోసమునకుఁ గోయఁ దగుఁ గేలు, వం
గి నతుల్ నీ కొనరించుహేతువున శిక్షింపం దగుఁ శీర్షముఁ,
దనదుష్కర్మఫలంబులఁ గుడువకుండ న్వచ్చునే యేరికిన్. ౩౨

మఱియు,

తే. గీ. జంతువులజీవనస్థితి జాగరణము
కాలధర్మంబు నొందుట గాఢనిద్ర
మేల్కొనుట పునర్జన్మంబు, మృత్యు వనిన
వెఱపు గల్గదు సుమ్మి వివేకులకును. ౩౩

ఈగ్రంథమునకు మొదట నీ వాడినప్రియభాషణంబులు పీఠికలు గాఁబోలు. ఈ నాటకంబునకుఁ జంద్రహాసప్రేషణము పూర్వరంగము గాఁబోలు! ఖడ్గగ్రహణము ప్రస్తావన గాఁబోలు! ఆహా! గొప్పసుశీలవుఁడవు. ఓహో! ఏమిప్రేమ నభినయించితివి! హృదయమున నెంత విస మున్నది! నిరాయుధుం జేసి బద్ధుం జేయుట నిలువెల్లఁ బిఱికికండలు గలనీవంటిపందకు చిత్రమైనపని. శూరుఁడవైన, సత్కులజాతుఁడవైన, నభిమానలవము నీహృదయంబున నున్న నాకరవాలము నా కిచ్చి బంధింపుము. ఛీ! ఆఁడుదియైన నీకన్న యోగ్యురాలు. సర్పములు, జెబ్బులులు మొదలగుదుష్టజంతువులను గ్రౌర్య

మున నీతోఁ బోల్చుట వాని నవమానించుట. నీతివిహీనుఁడ వైననీవు మహారాజామాత్యుఁడ వయ్యు నాకంటి కొక్క పురువులాగునఁ గనఁబడుచున్నాఁడవు.

మంత్రి—ఉగ్రసేన! పరాభవగ్రహావిష్టుఁ డై యొడ లెఱుంగక ప్రేలుచున్న నీదురాత్ముని నావలగదిలో బంధింపుము. సింహశార్దూలాదిఘాతుకజంతువులను మాయాప్రయోగములచే సాధించుట ధర్మవిరుద్ధము కాదు.

ఉగ్ర—అది యెన్నఁడు ధర్మవిరుద్ధము గాదు. మీవంటివారు ధర్మవిరుద్ధ మేయుదురా?

ఇంద్ర—నీముఖసందర్శనము మహాపాతకహేతువు. కావున నన్నావలకుఁ గొంపోవుట నా కుపకారము.

ఉగ్ర—నీ కుపకారము సేయుటే మా సంకల్పము. రా.

ఇంద్ర—ఇదె వచ్చుచున్నాను. పద. పద. (తనలో) అహాహా! ఐశ్వర్యము లెంతచంచలములు!

గీ. క్షణముక్రిందట నొకమహీకాంతుఁడ నయి
యపుడె కారాగృహంబున కతిథి నైతి
క్షణములో నెండ క్షణములో గాలివాన
కలిమిలేములు కావడికడవ లరయ. 3

ఆహా! ఈదురాత్ముఁడు మా చంద్రహాసున కేమియెగ్గు దలఁచి కుంతలంబున కంనో గదా! నావిషాద మతనియాపదఁ దప్పింపఁ జాలదు. ఈశ్వరేచ్ఛ యెట్లున్నది యట్లు జరుగు.

క. అమృతంబు విషప్రాయము
కమలాక్షునికరుణ దొలఁగుకాలమునందున్
గమలాక్షునికృప గలిగిన
నమృతం బగు విషముసయిత మరనిముసమునన్.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

మంత్రి—(తనలో) ఓయాశా! నీప్రభావము వర్ణనాదుస్సాధ్యము కదా!

మ. జనహింసల్ ప్రియఖేలనంబు లగు, వాంఛల్ హెచ్చు నీ వావహిం
చినవేళన్ హృదయంబు ఱాయి యగు దాక్షిణ్యంబుసే శ్చోఁ డెడన్
మన సాక్రోధమహాగ్నికిం గొలిమి యై మండున్ విజృంభించి నం
దనులున్ దండ్రులు నన్నదమ్ము లనుభేదం బుండ దింతేనియున్.

ఓభగవతీ! భక్తాభీష్టప్రదాయినీ! కాత్యాయనీ!

గీ. చంద్రహాసశోణితబిందుసమితి యనెడు
పూలమును నిన్ను నర్చింపఁ బూనియుండ
హంత లోనరించి రంతరాయముల నిపుడు
నేతు నిర్విఘ్నముగఁ బూజ చిత్తగింపు. 37

గీ. భాగురాయణచరితాప్రబంధమందు
ముగిసె మూఁడంకములకథ ముచ్చటొదవ
నాలుగవయంక మాడును నాసుతుఁడు
మాయలను బన్ని చంద్రాస్తమయముసంగు. 38

ఈరాత్రి జరుగుదోపుములోఁ జిక్కెడు ద్రవ్యంబు నుగ్రసేనుఁడు గాని, బంట్లుగాని హరింపకుండ నేను వేయికన్నులఁ గనిపెట్టుకొని యుండవలయు.

(అని నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.





# చతురచంద్రహాసము

—— :o: ——

## చతుర్థాంకము.

[అప్పుడు చంద్రహాసుఁడును చారాయణుఁడును కంచుకియుఁ బ్రవేశించుచున్నారు.]

చంద్ర—చారాయణా! పరిజన మాచెట్లక్రిందఁ బటకుటీరములలో విడిసి యున్నది కదా! నేను క్షణకాల మీయుద్యానవనమున విహరించి పథిశ్రమఁ బాపి కొనియెద. ఇందు మనము ప్రవేశింపవచ్చునేమో వనపాలకుల నడుగుము.

చారా—కుమారా! అట్లు చేసెద. ఓయీ! వనపాలకా! ఈయుద్యానవన మెవ్వరిది? మే మిందుఁ బ్రవేశించి క్షణకాలము విశ్రమింపవచ్చునా? ఏమను చున్నావు! ఇది యమాత్యభాగురాయణునితోఁటా! ఇందు యథేచ్ఛముగా మేము విహరింపవచ్చునా! సరి సరి! మంచివాఁడవు! కుమారా! రమ్ము. వనము బ్రవేశింతము

చంద్ర—చారాయణా!

క. తనయింటికి నతిథులమగు
మనకును స్వాగత మొసంగ మలయానిలునిచే
వనలక్ష్మి పనుచుచున్నది
యనుపమసుగంధ మనెడునర్ఘ్యముతోడన్.

చారా—కుమారా! అందుచేత వనలక్ష్మి నీ కిప్పుడు దర్శనీయురాలు.

చంద్ర—అయ్యా! ఈవనరామణీయక మెంతచూచినఁ దనివిసనక యున్నది.

సీ. ఎండ గన్పడకుండ నిలఁ గ్రమ్ముకొను చెట్లనీడలు వెడదపందిళ్ళు గాఁగఁ
జెలఁగి యిట్టటుఁ బ్రాఁకు చిలుకలబారులు పచ్చనితోరణప్రతతి గాఁగ
వనదేవతాదంతవైఖరిఁ దీనరాదుపూలు ముత్తియములప్రాలు గాఁగ
సకలజనానందసంధానకరములౌ పరభృతస్వనములు పాట గాఁగఁ
బూఁదుమారంబు పైఁ జల్లు బుక్క గాఁగ
నవవసంతోత్సవంబున నతిశయిల్లి

యమలినద్విజసంతర్పణములు గలిగి
యౌవనము బొల్చుఁ బెండ్లివారిల్లుబోలె. 2

చారా—పెండ్లికొడుకుఁ బెండ్లికూఁతురు లేని పెండ్లివారిల్లు శోభిల్లదు గదా! కావున నీపందిళ్ళనడుమ నిలిచిన నీవు పెండ్లికొడుకు వని తలంచెదను.

చంద్ర—కన్యాప్రదాతలు మనకొఱ కిక్కడ సిద్ధముగ లేరు.

చారా—అది నీ వెట్లు చెప్పఁగలవు. మహారాజసందర్శన మెట్లు పరిణమించునో?

చంద్ర—ముదిమిచే మతి చలించి యసందర్భములు పలుకుచున్నావు. ఇంక నీ పలుకులు గట్టిపెట్టి వనసౌందర్యముఁ జూతము. ఈమహీజములు సకలాలంకారములు దాల్చినయంగనల ట్లున్నవి. ఇదియెల్ల వసంతుని ప్రభావము గదా!

మ. తనరాజ్యంబున నున్నవృక్షములు సైతంబుం గడున్ శోభమై
దనరంగా వలె నంచు నెంచుచు వసంతక్ష్మాతలేంద్రుండు క్రొ
న్ననజొంపంబులతోఁ వినూతనలతాంతశ్రేణితోఁ బండ్లతోఁ
దనరం జేసె మహీరుహంబుల నిజౌదార్యంబు శ్లాఘ్యంబుగన్. 3

చారా—కుమారా! ఈపువుఁదోఁట నాకంటికి—

గీ. కుసుమదుండు వసంతుండు గురువు గాఁగ
జిలుకలును గండుఁగోయిలల్ శిష్యతతిగఁ
దన్మృదూక్తులు మదనవేదముగ నహహ
కామశాస్త్రకళాశాలగతిఁ దనర్చె.

చంద్ర—ఇది నాబుద్ధికి సిద్ధాశ్రమమువలెఁ దోఁచుచున్నది. ఎందుచేతనన,

మ. చలికిన్ వానకు నెండకున్ వెఱపు లేశం బేనియున్ లేక యా
కలముల్ డించు దిగంబరాకృతి నరణ్యావాసముం జేసి ని
చ్చలు నానందముతోడ మాధవపదాబ్జాతద్వయిం గొల్చుచుం
గలకాలంబును నీమహాంగములు వానప్రస్థుల ట్లుండుటన్. 5

చారా—కుమారా! ఈపులుఁగులు మిక్కిలియాత్మగౌరవముఁ గలజంతువులు సుమీ! ఎట్లన :—

మ. తలిదండ్రుల్ శ్రమజెంది కూరిచినవిత్తం బిచ్చి పోకున్న లో
భుల యాచింపక బంధుసంతతికి బ్రేఁగుంగాక యెల్లప్డు ఱె
క్కలనే నమ్మక పొట్టపోసికొని వేడ్కం బ్రొద్దులం బుచ్చెడున్
గలిమిం బ్రుళ్ళక లేమిఁ గుందక కడున్ సంతుష్టచిత్తంబులన్. 6

చంద్రి—చారాయణా! అంతేకాదు. పరోపకారార్థ మిదం శరీర మ్మను మాట యీపులుఁగులయందు సార్థక మగుచున్నది. ఎట్లంటేని,

మ. తమగానామృతధారచే నరులశ్రోత్రప్రీతి గావించెదుః
దమమాంసం బిడి చంపుచున్న నరుమేనం గండలం బెంచెదుః
దమచర్మంబులఁ గోళ్ళ నద్భుతపదార్థవ్రాతముం గూర్చు శ్లా
ఘ్యము లీపక్షులజీవితంబులు తదన్యంబు ల్గదుః వ్యర్థముల్. 7

చారా—కుమారా! ఎంతసేపు నీవివిహంగములనే మెచ్చెదవు గాని యాతుమ్మె తలం జూడవేమి?

గీ. విరహిణీజనంబులమీఁద విచ్చలవిడి
యలరువిల్తుఁడఁ జెట్టి యహంకరించి
చెఱుకుగడతుపాకులనుండి చిమ్మునట్టి
గుండ్లబారన నీతేఁటిగుంపు లలరు. 8

చంద్ర—ఓయీ! ముసలివాఁడ వైనను శృంగారరసాసక్తి ని న్నింకను విడువ లేదు. ఇది నా కట్లు తోఁచుట లేదు. వసంతుని కతిథు లైనబ్రాహ్మణులవిధమున నా కంటి కివి యగపడుచున్నవి. చూడు—

మ. వెలయంగా మధుపద్విజాళిక లతాపీఠంబులం బెట్టి య
య్యలరుందేనియపానకంబు లిడి దాహం బంతయుం దీర్చి య
వ్వల లేదెమ్మెరపీవనః విసరి సంభావించి వైశాఖపూ
జలు గావించు వసంతుఁ డెంతయు యశస్సంపాదనోత్సాహి యై. 9

చారా—కుమారా! పడుచువాఁడ వైన నీకు శ్రవణానందకరముగ నుండవలయు నని వర్ణనము శృంగారరసప్రధానము జేసితిని గాని నాకోఱుకుఁ గాదు. ఈసమస్తా రము జూడు—

గీ. పల్లవసమాగమంబున నుల్ల మలరి
వీనుదోయికి మిక్కిలి విందు గాఁగ
సొదుకోయెలవెలయాండ్ర పాటలవును
శ్రుతు లొసఁగుచున్న వీతేంట్లు రతులచేత. 10

చంద్ర—చారాయణా!

గీ. కడుపు నిండంగఁ బూఁదేనెకల్లు ద్రావి
క్రొత్తవార లున్నా రనుగొంకు లేక

వదరుచున్నట్టి తుమ్మెదకదుపుఁ జూడు
చెనఁటిత్రాగుఁబోతుల కెందు సిగ్గు గలదె. 11

చారా—ఇందుచేతనే మద్యపానము నిషిద్ధ మైనది.

చంద్ర—చారాయణా! మార్గాయాసముచేత బడలియున్న నాయంగములు విశ్రాంతిఁ గోరుచున్నవి. కావున విశ్రమించుటకు నాకేదైనలతాగృహము జూపుము.

చారా—(ఇట్టటుఁ జూచి) కుమార! అదె చూడు. భానుకిరణదుర్భేద్యముగ నున్నయాలతాగృహము నిజపుష్పసౌరభంబులచేత నిన్నక్కడకుఁ బిలుచుచున్నది. అందు మెత్తనిపూసెజ్జకూడ గలదు. అందించుకసేపు విశ్రమింపుము. నేనును నీలోన నీరాక యమాత్యభాగురాయణునిపుత్రున కెఱింగించి వచ్చెద.

చంద్ర—ఆతీవచప్పరము మిక్కిలి రమణీయముగ నున్నది. పద వెళ్ళుదము.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

[అంతట విషయయు సఖి యగు కాంచనమాలయుఁ బ్రవేశింతురు.)

విషయ—సఖీ! కాంచనమాల! నీమాటకు నే నేమిప్రత్యుత్తరము జెప్పఁ గలనే? నా కేమిచేయుటకుం దోఁచకున్నది.

తే. గీ. తల్లిదండ్రులయానతి దాఁటఁ జాలఁ
దలిరువిల్తునిదాడికిఁ దాళఁజాల
నెమ్మనమ్మునఁ గోర్కెలు నిలుపఁజాల
సిగ్గుపెంపున మీతోడఁ జెప్పఁజాల. 12

కాంచ—చెలీ! విషయా! నాకడ నీ కంతసిగ్గేలనమ్మా? చేటికలమనస్సులంతఃపురాంగనలమనోరథములు దాఁచుకొనఁదగినబరిణలుకదా!

విషయ—సఖీ! ఎఱుఁగుదును. నీకడ నున్నచనవు నాకు మఱియెవ్వరికడను లేదు. నీ కెఱింగింపఁ గూడనివిషయములు నా కెవ్వియు లేవు. ఆఁడుబిడ్డలమీఁదఁ దండ్రి కెంతయధికార మున్నదో చూడు—

తే. గీ. కన్నెమన సెట్టు లున్నదో కన్గొనకయె
యిచ్చవచ్చువానికిఁ దండ్రి యీయవచ్చు;
ఆవుదాన మిచ్చెడునప్పు డమ్మునపుడు
దాని నడిగి యిచ్చునె యజమానుఁ డెందు. 13

కాంచ—చెలీ! నిన్నంతగారామునఁ బెంచినమీనాయనగారు నిన్నుఁ బశుప్రాయముగఁ జేయునా?

విష.య—చేయ కేమి ! పాత్రాపాత్ర లెఱుఁగక పవిత్రచరిత్రము లేని బ్రాహ్మణునకు గోదాన మిచ్చినట్లె యేదో స్వప్రయోజనము మనస్సులోఁ బెట్టుకొని నన్నుగ్రసేనున కియ్యఁ దలంచుచున్నాఁడు. చండాలుని సమీపింప నొల్లనిఛాందసుఁడట్లు నా మనస్సుగ్రసేనునికడకుఁ బోవకున్నది. మనస్సాన్నిధ్యము గలిగినపిమ్మటఁ గదా శరీర సాంగత్యము. కూటమునం దనురాగము ప్రధానము.

క. అనురాగం బనియెడు ల
క్కను ననవిల్తుఁ డనుస్వర్ణకారుం డదికిం
చునఁట వధూవరహృదయము
లను గదలీఫలయుగంబులాగునఁ జెలియా. 14

కాంచ—చెలీ ! నే నది యెఱుఁగక పోలేను. అనురాగము లేనివానిపై మనసు నిల్పు మని కన్య నడుగుట పల్లమునుండి మెరకకు నీటికాలువఁ ద్రవ్వుట.

విష—ఓసీ ! యెఱిఁగి యెఱిఁగి యుగ్రసేనునిమీఁదఁ గూర్మి నిలుపు మని యెట్లుపదేశించితివే ?

కాంచ—మీనాయనగారు చెప్పుమన్నమాట జెప్పితిని. నీవు చెప్పినయుత్తర మాయనతో మరలఁ జెప్పెదను.

విష—నాయనగారు చెప్పవచ్చును. నే నేమని యుగ్రసేనుని వరింతునే ?

మ. ఎలప్రాయంబును జూచి మేల్వడుదునో యీతండు మేలౌగొనం
బులప్రోవంచును జెట్టఁబట్టుదునొ రూపుం జూచి కామింతునో
కులముం గన్గొని వానిఁ జేరుదునొ నాకీ నచ్చుసల్లక్షణం
బులలో నెయ్యది యున్నదో యట నిజంబుం జెప్పవే నెచ్చెలీ. 15

కాంచ—కన్యక పేక్షణీయము లగులక్షణము లేమియు వానికడఁ గనంబడవు.

విష—చెలీ ! ప్రపంచమున ననేకు లిట్టే తమబిడ్డలను ధనకాంక్షచేతను మోమోటచేతను బంధువులనిర్బంధముచేతను ననురూపవరాన్వేషణము సేయఁజాలకపోవుట చేతను వరునకుఁ దగినకట్నములు గానుకలు నిచ్చుటకుఁ దగినసామర్థ్యము లేకపోవుట చేతను,

సీ. పూఁటకు గతిలేనిపుట్టుపేదను నైన విద్దె యెఱుంగనిమొద్దు నైనఁ
బసయెల్ల దూలినముసలిదయ్యము నైన నెన రొకించుక లేని నీచు నైనఁ
దలలు మార్చెడుజగద్వంచకాధము నైనఁ గులగౌరవము లేనికూళ నైన
వినయసంపద లేనిఖిలేఁడి నైనను బరమలుబ్ధుం డగుపాపి నైనఁ

ప్రాణమిత్రుఁ డంచుఁ బ్రాఁతచుట్ట మఁటంచుఁ
గట్టిపెట్టుచుందురి కన్నియలను
నెట్టివారి కైన హితము లోఁ దలఁపక
తల్లిదండ్రు లౌర! దయ దొఱంగి. 16

కాంచ—అమ్మా! యెవరో కొందఱు గాని యంద ఱట్లు చేయుదురా.

విమ—కొందఱు గాదు. అనేకులు చేయుదురు. నీ వన్నట్లు కొంద ఱయినను, మాతండ్రి యాకొందఱిలోఁ జేరినవాఁడు. చెలీ! నిష్పక్షపాతమనస్సుతో. నీ వొక్క మాట చెప్పవే. అతని మొగ మైనఁ జూడ నొల్లనిదానను వానిపాణిగ్రహణ మెట్లు చేయుదునే? ఆతనితో నెట్లు గాపురము సేయుదునే? వానిచెట్టఁబట్టుట దున్నపోతు జెట్టఁబట్టుట గాదా! చెలీ! నాజనకుఁడు నిద్దురవోవుతఱి నన్ను నీట విడుచుట మేలు. విసము వెట్టి చంపుట నాకు మహోపకారము. ఒక్కసారి క్రూరఖడ్గముతోఁ గుత్తుక గోయుట మిక్కిలిప్రియము. ఓసీ! నానిశ్చయము త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నాను వినుము.

తే. గీ. పసపుబొం దని మెడ కొక్క పలుపుఁ జుట్టి
కా దనక యుగ్రసేనుఁడ స్తంబమునకుఁ
గఠినుఁడై నన్ను మాయయ్య గట్టు నేని
నదియె యురిత్రాఁడు నామెడ కంబుజాక్షి. 17

కాంచ—సఖీ! అమంగళవచనములు నోట రానీయకుము. అమ్మా! నీమనోవ్యథ యంతయు నే నెఱుఁగుదును. నిజముగా నీతండ్రి నీకు మహాపకారము చేయుచున్నాఁడు. ఈవిపత్సముద్రమునుండి నిన్ను దరిఁజేర్పఁగల తెప్ప యేమున్నది? ఈవివాహముఁ జేసికొనక తప్పదేమో యని నేను భయపడుచున్నాను.

విమ—(కోపముతో) ఏమీ! తప్పదా? నాకీ యాపదఁ గడువం బెట్టఁగల నెచ్చెలులు మువ్వు రున్నారు.

కాంచ—ఎవ రా నెచ్చెలులు?

విమ—సఖీ! మీరు గారు.

క. ఎన్నటికి దిక్కుమాలిన
కన్నెలపాలిఁటికిఁ గామగవు లీమువ్వుర్
మిన్నక విను చెప్పెద ని
ప్పున్నది నీరున్నది విసమున్నది నాకున్. 18

కాంచ—(చెవులు మూసికొని) సఖీ! అమంగళము ప్రతిహత మగుఁగాక సఖీ! ఆసన్నకల్యాణ మగు నీ విట్టిపలుకులు పలుకఁ దగదు. నీ కింతకష్టముగా నున్న దని విను నేని నీతండ్రి తన మతము మార్చుకొనవచ్చును.

విష—ఓసీ! నాతండ్రిమనస్సు వజ్రము. నాబాష్పజలముల నది తడిసి మెత్త బడదు. ఇంక నాయాశ లడుగంటినవి. ఈరాచకులమునఁ బుట్టుటకంటె నేపేదయింట నయినఁ బుట్టిన నింతకన్న సుఖపడుదునుగదా! కొట్టకొనకు నే నొకపక్షి నయి పుట్టి నను సుఖింతును. ఆహాహా!

మ. పులుఁగుంగన్నెలు తొంటిపుట్టువున నేపున్నోంబులం జేసెనో
తలిదండ్రుల్ సెల వీయకుండఁ దమలో దాంపత్యముల్ గూర్చుకొం
చలనుండీ వెలతూఁగుటుయ్యెలలపై నవ్వారిగా నూఁగుచుఁ
గలకాలంబును గరుచుఁ నగుమ నానందాబ్ధి నోలాడెడుఁ. 19

కాంచ—సఖీ! రాచకన్నియలుమాత్రము తమతమయభీష్టములం బడయలేదా?

విష—వా రెంతయదృష్టవంతులో విదర్భరాజనందన యగురుక్మిణి నిజసోదరులు పశుపాలుం డని గోపాలదేవు నధిక్షేపించి శిశుపాలున కియ్యఁదలఁచినపుడు వారిసంకల్పము భగ్న మగునట్లు యదువంశజలధిచంద్రుం డగువాసుదేవు నే చెట్టఁబట్టినట్లు, బలవంతుం డగుబలదేవుఁడు తన్నుఁ బాండవమధ్యమున కీయక దుర్యోధనున కీయఁ దలంచినపుడు వాసుదేవానుగ్రహంబునఁ దనమనోనాయకుఁ డైనయర్జునుని సుభద్ర పెండ్లియాడినట్లు, నిజమనోరథంబుల సిద్ధి నొందించుకొనుటకుఁ దక్కినకన్యలకు సాధ్యమా? వా రవతారపురుషుల నాశ్రయించుటచే వారు కోరినకోర్కె లన్నియుఁ బండినవి. అదియు నుంగాక వా రెవ్వరో యొక్కపురుషునిమీఁద వలపు నిలిపిరి. ఉగ్రసేనసాంగత్యము నాకక్కఱలే దనుచుంటిఁ గాని నే నింతవఱకు కెవ్వరిపైన వలపు నిలుపలేదు. నీవలపుల కొకనమస్కారము.

తే. గీ. అతివ యుగ్రసేనపిశాచ మావహించి
పీడ సేయకుండిన నాకుఁ బెండ్లి వలదు
బ్రహ్మచర్యవ్రతము బూని బ్రహ్మవిద్య
నభ్యసించి నే నాగార్గియట్లు లుందు. 20

కాంచ—చెలీ! నీ వింతకటకటంబడ నక్కఱ లేదు. నీయిష్టదేవత యైనకాత్యాయని యనుగ్రహమున నీవలపులకుఁ దావల మగువరుఁడు లభింపకపోఁడు. ఆమెకు మొక్కికొనుము.

విష—అనుదినమును మ్రొక్కుచు నేయుంటిని. ఇప్పుడు మఱియొకసారి మ్రొక్కెద.

సీ. కడుపార నేదేవిఁ గాంచి కొండలరాజు వేల్పులగమిలోన వినుతికెక్కె
చెలువార నేదేవిచెయిబట్టి ముక్కంటి యొకయింటివాఁ డయియుండఁగలిగె
చనువొప్ప నేదేవి చంద్రార్కకోటిసునరమేను జీలిచి యాక్రమించె
నెనరొప్ప నేదేవి నిర్జరావళిఁ బ్రోవ మహిషదానవు నాజి మట్టుపెట్టె
ఆ. వె. నళినగర్భురాణి నారాయణునిరాణి
యీడిగంబు సేయునువిద లెవతె
కట్టి యాదిశక్తి నఖిలజగన్మాత
నభిమతార్థసిద్ధి కాశ్రయింతు. 21

కాంచ—సఖీ! నీవు భగవతి యగు కాత్యాయని నక్షరపుష్పములతోఁ బూజించితివి గాన నామె సంప్రీత యయి నీ కనురూపవరుని నచిరకాలంబునఁ గూర్చు. నీ మనఃఖేదము కొంత శమించుట కీపువ్వుఁదోఁటలో నిటు నటు దిరుగుదము రమ్ము.

విష—సఖీ! యీవిహారములు జనకుఁడు నామనంబునఁ గావించినప్రహారముల వేదన నపనయింపఁ జాలవు. అయినం గొండొక ప్రొద్దుపుచ్చుటకు నీవెంట వచ్చెద నడువుము. (అని యిద్దఱు నడచుచున్నారు.)

కాంచ—కల్యాణీ! వసంతమహారాజుపరిపాలనము మిక్కిలి ప్రశంసనీయము సుమీ! ఇంతకుమున్ను వనభూములు బరిపాలించినశిశిరభూపాలుఁడు భూరుహప్రతతికి మిక్కిలియాకులపాటు గావించి మోడువఱచి యందు నివసించుద్విజావళి కన్నము లేకుండఁ జేసి బహుళార్తిఁ గావించెను. ఈవసంతభూపాలుఁడో వనభూములు సకలఫలసమృద్ధములై ద్విజులకలకలనాదములు గలిగి శోభావంతములై యుండునట్లు జేసెను. వెనుక దేశాంతరముల కరిగినద్విజశ్రేణి మరల వచ్చి యిందుఁ గాపురముండెను.

విష—కాంచనమాలా! ఈవసంతమహారాజు పరిపాలనమున నున్నయీద్విజశ్రేణి కెంతస్వాతంత్ర్య మున్నదో చూడు—

మ. అరి వెట్టం బనిలేదు స్వార్జితము కా నర్థంబులన్ లంచ మె
వ్వరి కీ నక్కఱలేదు, మంత్రులమహాద్వారంబులన్ నిల్వ న
క్కఱలే, దెయ్యది తోఁచునో యదియె పల్కన్వచ్చుఁ, బోవచ్చు నె
వ్వరితోఁ జెప్పక యిష్టమౌ కడకు నీ స్వాతంత్ర్య మెందున్నదే. 22

కాంచ—ఇట్టిస్వేచ్ఛ యేభూములలోను లేదు.

విష—సఖీ! నాతోఁటలో నున్న పులుఁగుల కున్నపాటిసుఖమయిన నాకుఁ గలుగనీయక నాతండ్రి చంద్రహాసముతో నాగొంతుఁ గోయఁ దలఁచుకొన్నాఁడే.

కాంచ—చెలీ! ఆచంద్రహాసమే నీకుఁ బూలదండ యగుఁగాక!

[అంతట లతాగృహమునఁ బండుకొని చంద్రహాసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విమ—సఖీ ! సఖీ ! అటు చూడటు చూడు. అపువ్వుటీరమునఁ బండుకొన్న వా రెవరే ?

కాంచ—(చూచి) కల్యాణి ! యెవరో క్రొత్తవార లున్నారు.

విమ—దాపునకుఁబోయి మేలుకొనియున్నారో నిద్రించియున్నారో చూచిరా.

కాంచ—(పోయి చూచివచ్చి) సఖీ ! గట్టుపట్టి గాఢనిద్ర బోవుచున్నారు. అతఁ డపూర్వపురుషుఁడు. మనయూరు గాదు. మనదేశము గాదు.

విమ—బ్రాహ్మణుఁడా, తదితరవర్ణస్థుఁడా ?

కాంచ—రూపరేఖావిలాసములం బోల్చి చూడ నతఁడు క్షత్రియకుమారు నట్లు తోఁచుచున్నాఁడు.

విమ—పరిక్క నెవరైన నున్నారా ?

కాంచ—ఎవ్వరు లేరు. సఖీ ! ఈపరిప్రశ్నలవర్షముతో నన్ను దడుపనేల? నీవు స్వయముగా వచ్చి యతనిం జూడుము.

విమ—సఖీ ! పరపురుషసందర్శన మెట్లు చేయుదునే ?

కాంచ—నిదురించుచున్నప్పుడు చేయవచ్చును. అయినను జూచినపిమ్మటఁ బరపురుషుఁడు గాకపోవచ్చును.

విమ—భావగర్భితము లయిన నీమాటలు గట్టిపెట్టి నన్నటకుఁ గొనిపొమ్ము.

కాంచ—సఖీ ! నిన్ను నే గొనిపోనక్కఱలేదు. నీయాత్రమే నిన్నటకుఁ దోడ్కొనిపోవును. (అని యిద్దఱు లతాగృహము సమీపింతురు.)

విమ—(చూచి) సఖీ !

తే. గీ. జనకుఁ డవతారముల నెత్తి జగతిఁ దిరిగె
నేటి కవతారములు దాల్చి యేనుఁగూడ
వసుధఁ జరియింపరా దని పంతగించి
మనుజుఁ డై వచ్చినట్టి మన్మథుఁ డితండు. 23

కాంచ—చెలీ ! నిజమె. సహధర్మచారిణి యయినరతీదేవియు నతనితోఁ గూడ మహీమండలమున నవతరించి యుండుటంజేసి యామెను వెదకికొనుచు నతఁ డిందు వచ్చి యుండవచ్చును.

విమ—రతీదేవి యెం దున్నది ?

కాంచ—ఎందున్నదో యెవ్వ రెఱుఁగుదురు. ఇం దుండవచ్చును.

విష.—(చిఱునవ్వుతో) చాలు ! నీపరిహాసములు.

కాంచ.—పరిహాసము గాదమ్మా ! నేను నిజమే చెప్పితిని. మన్మథుఁ డున్న చోటనే రతి యుండును.

విష.—సఖీ ! ఈపురుషరత్న మేవంశఖనియందు జనియించెనో కడుసార నీతనిం గని యేతల్లిదండ్రులు ధన్యు లయిరో యితనికి నివాసస్థానమై యేభూమి పుణ్య భూమి యయ్యెనో యీతనినామధేయముం దాల్చి యేవర్ణము లక్షరము లయ్యెనో తెలియలేదుగదా !

తే. గీ. దానిపున్నెంబె పున్నెంబు, దానిచక్కఁ
దనమె చక్కఁదనము, దానితనువె తనువు,
దానిజన్మంబె జన్మంబు, వీనిఁ గూడి
యఖిలభోగంబు లేయింతి యనుభవించు. 24

మఱియు—

తే. గీ. అడవిఁ గాచినవెన్నెల యౌవనంబు
పడటఁ గలిపినపన్నీరు భాగ్యరేఖ
శూన్యగృహగతదీపంబు సోయగంబు
ఈనృపాలనందను వరియింపకున్న. 25

కాంచ.—నామధేయాదు లీయనను లేపి కనుగొందమా ?

విష.—సఖీ ! నిద్రాభంగము చేయరాదు. ఈయన నైఖరిఁ జూడ నధికపరిశ్రమముచే బడలినట్లు గనఁబడుచున్నాఁడు.

కాంచ.—అట్లయిన నీయనవృత్తాంతము మన మెఱుఁగు టెట్లు ?

విష.—ఆయనంత టాయన మేల్కాంచువఱకు క్షణకాల మిచ్చట నిలిచి యీలా వణ్యసముద్రమున నోలలాడుదము.

కాంచ.—ఆసముద్రతరంగములలోఁ బడి నీ వెక్కడికి గొట్టుకొనిపోవుదువో యని భయపడుచున్నాను.

విష.—నే నెక్కడికిఁ గొట్టుకొనిపోను. ఇక్కడనే యుందును.

కాంచ.—ఔనౌను. ప్రేమ యను జిగురుచే నీపాదము లీస్థానమున గంటుకొని యున్నవి. కాదు కాదు. ఎవఁడో యశరీరుఁ డైనవిలుకాఁడు తనబాణపరం పరచేఁ గదలకుండ నిన్నరికట్టి యుండెఁబోలు !

విష.—సఖి ! నీయిష్టమువచ్చినట్లు నన్ను నుటకు నీకు సమయము దొరకినది.

కాంచ.—భగవతి యైనకాత్యాయని వెంటనే నీప్రార్థనము సఫలము జేసినది.

విప.—సఖీ ! యిల్లలుకఁగానె పండుగ గాలేదు. నావంటిమందభాగ్యురాలి కంతయదృష్టము పట్టునా ?

శా. ఈరాజన్యునికేలు వట్టుటకు మున్నేకన్య సద్భక్తిమై
నారాధించెనొ స్వర్ణపుష్పములతో నాయద్రిరాట్కన్యకన్
గారుణ్యామృతవృష్టులం గురిసి యాకాత్యాయనీదేవి యే
నారీరత్నమనోరథాంకురముల న్వర్ధిల్లఁ గాఁ జేయునో. 26

కాంచ.—కాత్యాయనీదేవికి నీయందు సంపూర్ణానుగ్రహ ముండుటచేతనే నీమనసుకు నచ్చునట్టియనుకూలవరునిఁ జేయిబట్టుకొని తీసికొనివచ్చినట్లు నీయెలదోఁటకుం దీసికొనివచ్చి, మనసారఁ జూచి యానందింపు మని నీకన్నులముందఱఁ బడవైచినది. దేవి చేయవలసినపని యైనది. ఇఁక నీ పనియె కొఱఁత.

విప.—నాపని యేమున్నది ?

కాంచ.—నీగుణములచేత నితనిని బంధించి వశంవదుని జేసికొనుటే.

విప.—ఓసీ ! నీనోరు విశృంఖలమై వదరుచున్నది.

కాంచ.—అది కాలపరిభావము. మున్ను మూఁక లయినకోయిలలు వసంతమున వాచాలతఁ జూపవా ?

విప.—సఖీ! చూడుచూడు. నిద్రలో నతఁడు మందహాసము చేయుచున్నాఁడు.

కాంచ.—కలలో నీవంటిరసికురా లెవ్వతెయో సరసోక్తులచే నతని నలరించి యుండును.

విప.—నీపరిహాసము పారము మీఱినది.

కాంచ.—నీమోహము వెల్లివిరిసినప్పుడు నాపరిహాసము పారము మీఱదా ?

విప.—ఓసీ ! ఆయన యొత్తగిల్లుచున్నాఁడు. మెలఁకువ వచ్చునేమో యావలకుఁ బోదము రా.

కాంచ.—మెలఁకువ రాలేదు.

విప.—ఓసీ ! ఒత్తగిల్లినప్పుడు పక్కలోనుండి యేదో క్రిందఁబడినది. మడఁచిన భూర్జపత్రమువలె నున్నది చూడు.

కాంత.—ఔను ! అడుగులచప్పుడు గాకుండ బొటనవ్రేళ్ళమీఁద నడచి యా భూర్జపత్రముం దీసికొనివత్తునా ?

విప.—అది యేదో జాబై యుండవచ్చును. ఒకరిజాబొకరు చూడఁ గూడదు.

కాంచ.—మన మాయనరహస్యములు దెలిసికోవద్దు. ఈయన యెవ్వఁడో తెలిసికొందము.

విష—అట్లయినఁ దీసికొనిరమ్మ.

కాంచ—(మెల్లగా నడచి భూర్జపత్రముం దెచ్చి) ఇదిగోనమ్మా! ఇది యేదో లేఖవలె నున్నది.

విష—(పుచ్చుకొని చూచి) ఔనే! ఇది మాతండ్రివ్రాతవలె నున్నదే. ఈ లేఖ మాయన్నయైనమదనునికై వ్రాయఁబడినది. కాని, యీ నవమన్మథుఁ డేల యీ లేఖావాహకుఁడు గావలెనో?

కాంచ—విషయముఁ జదువుము.

విష—ఇదిగో చదువుచున్నాను—

శ్రీరస్తు చిరంజీవి యగు మదనుని మీ జనకుఁడు భాగురాయణుఁడు చిరాయురారోగ్యములు గల్గునటు లాశీర్వదించి వ్రాయునది :—

సీ. ఈతండు పౌళిందుఁ డింద్రదత్తసుతుండు చంద్రహాసుం డని జగతిఁ బరఁగు

కాంచ—ఓహో! పుళిందరా జగు నింద్రదత్తునికుమారుఁడా యితఁడు!

విష—(తనలో) హృదయమా! నీ కిప్పుడు కొంతయాశ కలిగినదా?

కాంచ—తరువాతఁ జదువవమ్మా!

విష—

ఇతఁడు సద్గుణరాసి యితఁడు విద్యలప్రోవు స్తవనీయ మీతనిశౌర్యశక్తి
చిరకాల మీతఁడు జీవించియుండెనా యరిగాపులను జేసి యఖిలనృపులఁ
గుంతలరాజ్యంబుఁ గొఱలేక పాలించు నేవిధంబున నైన నీనృపుఁడు

తే. గీ. మనకమిత్రుఁడు గావున మదన! నీవు
ఏను లేనని సందియం బింతకడక
యెట్లు సేయుదు నని భయం బింతపడక
విషము నీతని కియ్యవే శ్రద్ధతోడ. 27

కాంచ—(ఆశ్చర్యముతో) ఇది యేమిటమ్మా! విషయ మతిదారుణముగా నున్నది.

విష—సఖీ! తండ్రిగారిపూర్వవృత్తాంత మెఱిఁగినవారి కిది యాశ్చర్యము గలిగింపదు. తండ్రిగారే కాదు. రాజకార్యపరతంత్రులమార్గములే యివి. వారికి—

తే. గీ. లేవు పాపపుణ్యంబులు లేదు జాలి
లేవు నియమముల్ దైవంబు లేదు సుమ్మ
లేదు లవమైన లోకాపవాదభీతి
పురుషకారంబె దైవ మీపూరుషులకు. 28

(విచారముతో) ఆహాహా! సఖీ! నాతండ్రి యెంతపాపమున కొడిగట్టెనే. లోకమునం దనకంటెం బరాక్రమవంతులు సద్గుణశాలురు విద్యావినయసంపన్నులు నుండంగూడ దని యాతనియభిప్రాయము. అట్టివారి నెల్లం గడతేర్చి మహీమండల మెల్లం దా నాక్రమించి యనంతరమునం దనప్రియకుమారుం డైనమదనునకుం బట్టము గట్టవలెనని యాతనిసంకల్పము. ఆసంకల్పసిద్ధికై యీప్రయత్నము. హా! తండ్రి! నీవు రాక్షసుండవు గాని నరుండవు గావు. కటికివాం డైనం జేయంజాలనియీఘాతుకకృత్యము నీవు నీకొడుకుచేతం జేయం దలంచితివి.

శా. ఆవిజ్ఞాన మశేషముం బదడుగా నాశాంత మాగూప మా
లావుం దగ్ధముగా వసుంధర మహాలంకారశూన్యంబుగాం
బూః క్లానికి గర్వభంజకనరుగా భూపాలవంశంబు న
ష్టాస్తంభముగా నొనర్చెసి యనార్యం బైనయీకార్యముల్. 29

కాంచ—జీవహింసకులకు జాలి యుండునా? చక్కనిపిట్ట యని కిరాతుండు జాలిపడి హింస మానునా?

విష—ఆకిరాతులకును నాతండ్రికి నెంతమాత్రము భేదములేదు. అట్లు కానిచో నీనవపుష్పసాయకుని నీసుకుమారుని నీవిజ్ఞానరత్నాకరుని నీరాజకులవిభూషణుని నీపండితారామవసంతుని విషప్రయోగముచేం జంపింపం దలంచునా?

క. శిలయో యినుమో వజ్రమొ
చెలి! నాజనకునిహృదయము జెప్పం దరమె యీ
యలఘునిసురూపరేఖా
కలనంబున నించుకైనం గరుగక యునికిన్. 30

కాంచ—కళ్యాణీ! నీతండ్రిచెయ్వులం దలంచి విచారించినం గార్యమేమి? ఇతని నీవిపత్సముద్రమునుండి యుద్ధరింపవలయుం గదా!

విష—ఔను! అదియే ప్రథమకర్తవ్యము. అందుల కిప్పు డేమిచేయుదము?

కాంచ—ఇతనిని మేల్కొలిపి యాసన్నమైనయపాయముం దెలిపి పారిపొమ్మని చెప్పుదమా?

విష—అది శూరుండగురాజకుమారున కుపదేశింపవలసినవిషయము గాదు.

కాంచ—పోనీ! యీజాబు చింపివేయుదమా?

విష—ఈమహాభాగుండు మేల్కని దానికై వెదకులాడి పరితపించునుగదా!

కాంచ—అట్లయిన నేమి చేయుదము?

విష—నే నమాత్యభాగురాయణునిపుత్రికనుగదా! "పుత్రాది దిచ్చే త్వరా

"జయ" మ్మను నారోగ్యోక్తినిబట్టి తండ్రి బిడ్డలకుఁ బరాభవము నిచ్చగించును గావున నే నిప్పుడు మాతండ్రికిఁ బరాజయమును బరాభవంబును గలుగునట్లు స్వకార్యసాధన మగునట్లుఁ జేసెద. సత్వరమ నీ వొకసారి లేఖిని నిటు దెమ్ము.

కాంచ—ఇదె తెచ్చుచున్నాను. (అని పోయి కలముఁ దెచ్చుచున్నది.)

విష—సఖీ! ఈజాబు రెండుచోట్ల దిద్దినపక్షమున నిది మన కనుకూలముగా నుండును. ఎట్లంటివేని, 'మనకమిత్రమిత్రుఁ' డనుచోట 'క' వర్ణకము 'కు' వర్ణకముగాఁ జేసిన 'మనకు మిత్రుఁ' డని పాఠమేర్పడఁగలదు. 'విషము' అనుచోట 'విషయ' అని 'ము' వర్ణకమును 'య' వర్ణకముఁ జేసినయెడల నన్నీతని కిచ్చి పెండ్లి సేయుమని యర్థ మగును. అట్లే దిద్దితిని. మఱియొకసారి జాబు చదివెద విని సందేహమున్నఁ జెప్పుము. (అని జాబు మరలఁ జదువుచున్నది.)

కాంచ—(విని) భళీ! చెలీ! భళి! నీబుద్ధిబలముచేత నీతనిప్రాణరక్షణము సేయుటయె గాక స్వకార్యముఁగూడ సాధించుకొంటివి. జా బిటు దెమ్ము. (అని చూచి) సఖీ! దిద్దినయానవాలు లేకుండ నక్షరములు మార్చితివమ్మా! అతనిప్రక్కలో వైచెద. (అని యట్లు చేయును.)

విష—చెలీ! యీసారి మనమదనుఁ డేమిచేయును?

కాంచ—చండశాసనుఁ డైనతండ్రికి భయపడి యీరాత్రియే నిన్ను వీని కిచ్చి వివాహము సేయును. కాని, యతఁడు లేచెడువేళ యైనది. మన మిట నుండరాదు. పోవుదము రమ్ము.

విష—సఖీ! ఏమైనఁ గానిమ్ము. జాబులు దిద్దుట దోష మైనను మహాపురుష ప్రాణరక్షణమువలన నాదోషము శమింపక పోవునా యని యీతప్పుఁజేసితిని. భగవతి కాత్యాయని నన్ను క్షమించుఁగాక! మన మావలకుఁ బోయి పువ్వులు గోయుదము రమ్ము. (అని నిష్క్రమింతురు.)

చంద్రి—(అంతటఁ జంద్రహాసుఁడు మేలుకొని యొడలు విఱుచుకొని) ఆహాహా! నిద్రకంటె సుఖప్రద మైనది మఱియొకటి లేదు.

ఉ. దూరపథిశ్రమంబునను దూలినయంగములన్ యథాపురా
కారములన్ పొనర్చుటకు గాఢసుషుప్తి మహౌషధం బగున్
శారదచంద్రచంద్రికలు చందనచర్చలు సన్నగాడ్పు క
ర్పూరపరాగముల్ నిదురఁ బోలవు సౌఖ్య మొసంగు నేర్పునన్. 31

(అని లేచి యిట్టటు జూచి) మదనునిసన్నిధి కరిగిన చారాయణుఁ డింకను రా లేదు. అతఁడు వచ్చువఱకు దర్శనీయ మైన యీయుద్యానవనము నింకను జూచెద. (అని కొంతదూరము నడచి) ఆహాహా! యీలతాంగి యెవ్వరో—

తే. గీ. ప్రాణములు దాల్చుజాళువాపసిఁడిబొమ్మ
మేను గైకొన్నక్రొక్కారుమెఱుపుదీఁగ
మూర్తిఁ దాల్చినమరునిసమ్మోహనాస్త్ర
మగును గాని యీయెలనాఁగ యతివ యగునె. 32

తే! గీ. అలరుతూపులు మెత్తని వగుటఁ జేసి
శౌర్యధనులపైఁ బనిసేయఁ జాల వనుచుఁ
గ్రొత్తయలుఁగుల నార్జింపఁ గోరి మారుఁ
డలఘుఁబోఁడివాల్చూపుల నాశ్రయించె. 33

వీ రిరువురు నేవోముచ్చటలు జెప్పుకొనుచున్నారు నేను ప్రక్కను నిలిచి వారిసంభాషణముంబట్టి యీమె యెవ్వరో తెలిసికొనియెద.

విష—సఖీ! నామనసు నాయొద్ద లేదే. నే నెట్లు పూవులు గోయఁగలనే?

కాంచ—ఔను! నీతల మనశ్శూన్యమై చిలుక లేనిపంజరమ ట్లున్నది.

చంద్ర—(తనలో) ఈమెమనస్సు పరాయత్తమగుట కేమికారణము చెపుమ!

విష—నీ వన్నట్లు నామనఃకీర మామదవతీమందారముపై వాలినది.

చంద్ర—ఆహాహా! మదవతీమందారుఁడై యీమెమనస్సు నాకర్షించిన యా ధన్యుఁ డెవఁడో!

కాంచ—పాఱిపోయినచిలుక వెండియుఁ బంజరముఁ జేరుటరిది.

విష—చెలీ! నామన స్సెప్పుడు కుదుటఁబడునో తెలియదు. అమాత్యభాగురాయణునిబిడ్డనైన నే నింతమనోవ్యథఁ బొందవలసివచ్చు నని కలలో నైనఁ దలంపలేదు.

చంద్ర—(తనలో) ఏమీ! యీమె యమాత్యభాగురాయణుని పుత్రికా? మనస్సా! ఇది నీ కందనిఫలము. ఆశపడకుము. ఓభగవానుఁడ! కామదేవ!

తే. గీ. దుర్లభపదార్థములమీఁదఁ ద్రోచి మనసు
గార్యసిద్ధి సత్వరముగఁ గలుగనీక
ప్రజల బాధించి సంతోషపడెదు, లేఁడు
పుడమి నినుఁబోలునెఱజాణ పుష్పబాణ. 34

కాంచ—సఖీ! నీసోదరుఁడు మదనుఁడు నీమనోరథసిద్ధి చేయును. విచారపడకుము.

[అంతట మదనుఁడు చారాయణసమేతుఁడై ప్రవేశించుచున్నాఁడు.]

కాంచ—సఖీ! అదిగో నీసోదరుఁడు వచ్చుచున్నాఁడు.

విష—ఓసీ! ఇతఁ డేమిచేయునో యీపొదరింటిచాటున నుండి విందము రా.

(అని యట్లు చేయుదురు.)

మద—ఆర్య ! చారాయణ ! ఏఁడీ చంద్రహాసుఁడు ?

చారా—అయ్యా ! మొదట నీలతాగృహంబునఁ బవ్వళించెను. ఇప్పు డిందు లేఁడు. అదిగో ! యాపొన్నచెట్టునీడను నిలిచియున్నాఁడు.

మద—(చూచి తనలో)

తే. గీ. కుసుమబాణున కరయ సగోత్రుఁ డితఁడు
చందమామకుఁ జేరువజ్ఞాతి యితఁడు
సుందరుఁ డగువసంతునిచుట్టమి తఁడు
కానిచో నిట్టియందంబు గలదె యెందు. 35

చారా—కుమార ! చంద్రహాస ! ఇతఁడే యమాత్యభాగురాయణునిపుత్రుఁడు మదనుఁడు. నీరాక విని వచ్చియున్నవాఁడు.

చంద్ర—మదన ! నీ సందర్శనమున ధన్యుఁడ నైతిని. ఈయుద్యానవనమున నాటఁబడినమనస్నేహబీజ మచిరకాలమున మహావృక్ష మై ఫలించుఁగాక !

మద—చంద్రహాస ! వసంతసన్నిధానమున నాటినయాబీజము మహావృక్షము గాఁ బరిణమింపక పోదు.

తే. గీ. మనసు కలసినమిత్రులు మనజనకులు
రెండుమేనులు వారికి, హృదయ మొకటె
వారిబిడ్డలకు మనకు వారిమైత్రి
సహజముగ సంక్రమించుట సఖుల మనఘ. 36

చంద్ర—అందుచేతనే నీజనకుఁడు నాజనకు నొడంబఱిచి నన్ను నీయొద్దకుఁ బుత్తెంచె.

మద—పుత్తెంచుటకుఁ గారణ మేమి ?

చంద్ర—నీజనకుఁడు స్వయముగా వ్రాసినయీలేఖయే కారణము దెలుపును.

(అని జాబిచ్చును.)

మద—(జాబు నందికొని చదువుకొని) ఓహో ! సంతోషము. సంతోషము. మాతండ్రి తనవివేకమునకు దీర్ఘదర్శిత్వమునకుఁ దగినట్లు చేసినాఁడు. చంద్రహాస !

తే. గీ. అన్యపూరుషుం డనుకొన నాప్తుఁ డైతి
పరుఁడ వనుకొనఁ బోరానిబంధు వైతి
వతిథి వనుకొన మాయింటియల్లుఁ డైతి
మాట లేటికి గారాబుమఱఁది వైతి. 37

చంద్ర—(ఆశ్చర్యముతో) మదన! నీమాటలు నా కర్థము గాకున్నవి.

మద—ఈజాబు మాతండ్రి నీకు వినిపింపలేదా?

చంద్ర—లేదు.

మద—అట్లయిన విను. (అని జాబు చదువును.)

చంద్ర—(విని) ఆహా! ఇందులకా యమాత్యభాగురాయణుడు మిక్కిలి గూఢముగా నన్నిటకుఁ బంపినది. మహాత్ముల ప్రారంభములు ఫలానుమేయములు గదా! మదన! ధన్యుఁడ నైతిని.

శా. నావంశంబు పవిత్రమైనయది ధన్యంబయ్యె నాజన్మముల్
నావిజ్ఞానము నాదుబాహుబలముల్ నాశౌర్యధైర్యంబులున్
మీవియ్యంబున వన్నెకెక్కినవి సూ మీతండ్రి కారుణ్యపా
రావారంబునఁ దేల్చినాఁడు ననుఁ బ్రారంభించి యీకార్యముల్ 38

మద—అయ్యా! అట్లు కాదు. మేమే ధన్యుల మైతిమి. ఏలయన,

తే. గీ. జాతిరత్నంబు స్వర్ణభూషణముఁ జేరుఁ
జిగురువిల్తుఁడు సంకల్పసిద్ధుఁ డగును
తమ్మిచూలిపూనిక తుదఁదాఁకు నింకఁ
గామ్యమైనట్టి మీసమాగమముచేత. 39

రమ్ము మాగృహంబునకుఁ బోదము. దైవజ్ఞులఁ బిలిపించి సుముహూర్తము నిర్ణయించి నేడో రేపో వివాహము జేసెద.

చంద్ర—నాతలిదండ్రు లైన రావలదా?

చారా—అయ్యా! జననీజనకు లీయనవివాహము గన్నులపండువుగాఁ జూడ నువ్విళ్ళూరుచున్నారు.

మద—అంతవఱ కాఁగుటకు వీలు లేదు. అమాత్యభాగురాయణుఁడు చండ శాసనుఁడు.

తే. గీ. సూర్యచంద్రులగతులట్లు సూటి దప్ప
కుండ నతనియానతి సెల్లుచుండవలయుఁ
దద్గతులు దప్పనెడ నుపద్రవము లైన
యట్లె యతనియానతి మీఱ నాపద లగు.

చంద్ర—విధినియోగమునకట్లె చతురాస్యుఁ డైనమీతండ్రినియోగమునకుఁ బద్ధుఁడను. (తనలో) అహాహా! నేను బెబ్బులిగుహకో మసకపుపాముపుట్టకో బోవుచున్నానని నిష్కారణముగా మాతండ్రి భయపడెను.

తే. గీ. భాగురాయణామాత్యుండు పయికి మిగులఁ
గఠినుఁ డయ్యును లోఁ గనికరము గలఁడు
స్వాదుజలమును గుంజు లోపల వహించి
పైకిఁ గఠిన మగు టెంకాయపగిది గాఁగ. 41

భాగ్యములు దైవాధీనములు గాని మనుష్యాయత్తములు గావు.

మ. అనుకూలం బగునేని దైవము నరుం డంభోధిలో నున్న కా
ననమధ్యంబున నున్న శీతనగశృంగం బెక్కి కూర్చున్న నె
వ్వనియత్నంబులు లేకయే స్వయముగాఁ బ్రాపించు నెన్నేని శో
భనముల్, పౌరుష మంతయుం జెడును దైవప్రాతికూల్యంబునన్. 42

(అని మదన, చంద్రహాస చారాయణులు నిష్క్రమించుచున్నారు.)

కాంచ — సఖీ! మనోరథవృక్షము పూలు పూఁచినది. నేఁడో రేపో ఫలించును.

విష — చెలీ! నిజమే గాని నాజనకునిదుస్తంత్రము లనియెడు గొడ్డలిపెట్టున నీ మనోరథవృక్షము కూలకుండవలయును గదా! అన్నిటికిని నాధారము శ్రీకాత్యాయనీదేవియే.

(అని యిద్దఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



# చతురచంద్రహాసము

:o:

## పంచమాంకము.

[అప్పుడు భాగురాయణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భాగు—(తనలో) దేశకాలపాత్రము లెఱిఁగి నడపునట్టి ప్రౌఢ యుండవలయును గాని యౌషధములకుఁ బనికిరానిమూలిక లేదు; కొఱగానిమనుష్యుఁడు లేఁడు.

క. చీఁపురుకట్టల కైవడి
కాపురుషుల నైనఁ దా నొకానొకవేళం
జేపట్టవలయుఁ జుమి తన
వ్యాపారము దీరుకొఱకుఁ బ్రాజ్ఞుఁడు ధృతితోన్.

ఇందుచేతనే గదా యుగ్రసేనుం జేపట్టి కార్యసాధనము జేసికొంటిని. నాప్రయోగించిన రెండుమాత్రలతో వాఁడు తొంటిజాడ్యముఁ బాసి నాకు గులామై నాచేతిబంతియై నే నెందు వైచిన నందుఁ బడుచున్నాఁడు. వానిసాయమున నింద్రదత్తుని బంధించితిని. ఇఁక నిచ్చట—

ఉ. కాటికిఁ బ్రాఁతకాపగును గావిసముం దిని చంద్రహాసుఁ డీ
పాటికి, నాకుమారుఁడు నృపాలుని మెప్పును గాంచియుండు నీ
పాటికి, నుగ్రసేను చెయి బట్టఁగ నాసుత సమ్మతించు నీ
పాటికి, నింక మామదనుపాలగు రాజ్యము, మాట లేటికిన్. 2

మదనుఁడు నేను వ్రాసిన తెఱంగునఁ జేసి యుండునా! ఏల చేయఁడు? వాఁడు మాత్రము మనుష్యుఁడు కాఁడా? వసుంధరాపరిపాలనకాంక్షయు రాజపుత్రికాసమాగమకుతూహలంబును జీర్ణవృక్షమువంటినాకే యుబలాటముఁ గలిగించుచుండ వాని కాళులు బుట్టింపవా? నామనస్సు తెఱఁ గెట్లుండునో తెలిసికొనుటకై మొదట వాఁడు అడ్డదిడ్డముగా వాదించియుండును. పిదప స్వలాభ మపేక్షించి నాయుపదేశము తనకు

శుభావహ మని యెఱింగియుండును. ఇదిగో! నాగృహము. ప్రవాసదుఃఖితునకు స్వగృహదర్శనము సకలశ్రమాపనోదము. ఏమిది! నాయిల్లు కలకలలాడుచుఁ గల్యాణ నిలయమై యున్నది. ఈమామిడాకుతోరణము లేమి! ఈయలంకారము లేమి! ఈ పందిళ్లేమి! హృదయమా! నీ వేమివార్త వినుచుంటివో కదా! ఏమివార్త యని సంశయింప నేల? మామదనునివిద్యావినయసౌందర్యాదినిరుపమానగుణంబుల నెద మెచ్చి కుంత లేంద్రుఁడు తనకూఁతుం జంపకమాల వాని కిచ్చి వివాహము చేసియుండును. నే నూర లేనప్పు డంతతొందరపడి యతఁ డేలచేయును? ఏమో! రాజు శతవృద్ధు. ఆసన్నమర ణుఁడు. నేను వచ్చువఱకుఁ దాను జీవించుట కష్ట మని యట్లు చేయఁగూడదా? అట్లే కానియెడల నాయింట నీకల్యాణలక్షణము లేల యుండవలెను? దీనికిఁ గారణ మరయు టకు నాహృదయము తత్తఱపడుచున్నది. ఓరీ! ఎవఁడురా యక్కడ? ఏఁడీ! మదనుఁ డేఁడీ? మదనుఁ డేఁడీ?

[సేవకుఁడు ప్రవేశించి]

సేవ—దేవా! ఈగదిలో నున్నాఁడు. ఇటు దయచేయుఁడు. ఇటు దయ చేయుఁడు.

భాగు—(గదిలోఁ బ్రవేశించి) మదన! మదన! నేను వ్రాసినచొప్పునఁ గార్య నిర్వాహకము చేసితివా లేదా?

మద—(లేచి) తండ్రీ! నమస్కారము. మీరు వ్రాసినచొప్పున నే తూచా తప్ప కుండఁ జేసితిని.

భాగు—బాగు మదనా! బాగు! పితృవాక్యపరిపాలకుఁడ వగునీ కభ్యుద యము గల్గుఁగాక! నాయభీష్టప్రకారము నీవు చేయుటంజేసి యిప్పుడు నాహృదయ శల్య మూడిపోయినది. మనసు ప్రశాంత మైనది. మదనా! నీ వట్లు చేయుటకు సాహసింప వనుకొంటిని

మద—తండ్రీ! నీయాజ్ఞ నుల్లంఘింతునా?

భాగు—వత్స! కుమారుఁడవన్న నీవే కుమారుఁడవు. పితృవాక్యపరిపాలనంబున రఘురాముఁడు భృగురాముఁడు నీకుం జాలరు.

మద—పితృవాక్యపరిపాలనము పుత్రులకు విధిగదా!

భాగు—కుమార! ఈతోరణములేల కట్టఁబడినవి? ఈపందిళ్లేల నిర్మింపఁబడి నవి? గృహమున కీయలంకార మేలచేయించితివి?

మద—తండ్రీ! వివాహమునకు గృహాలంకారము చేయుట సముదాచారము గదా!

భాగు—ఏమీ! వివాహమైనదా? ఆహా! నే ననుకొన్నట్లే సంపూర్ణమైన యదృష్టము నాకుఁ బట్టినది. కుంతలరాజ్యలక్ష్మి మనయధీనమైనదా? రాజు చిట్టచివరకుఁ జంపకమాలికను నీకే యిచ్చి వివాహము జేసెనా? నేను సన్నిధిని లేనందులకు విచార మించుకయును లేదు. కుమారా! నన్ను గాఢాలింగనము జేసికొనుము. నా మదనుఁడు కుంతలమహారాజయ్యెఁగా! ఎంతపుణ్య మెంతపుణ్యము!

మద—(తనలో) ఏమిది! ఈయన మిక్కిలి యసంగర్భముగ మాటలాడుచున్నాఁడు. (ప్రకాశముగ) తండ్రీ! నీపలుకులు నా కర్థ మగుట లేదు. రాజు చంపకమాల నిచ్చి నాకు వివాహము చేసెనని నీ కెవ్వరు చెప్పిరి? నేను కుంతలరాజగు టేమి? ని న్నింగతాలి సేయుటకుఁ గిట్టనివా రెవ్వరైన నీతో నిట్లు చెప్పిరాయేమి?

భాగు—(ఆశ్చర్యముతో) ఏమి! నీవు రాజపుత్రికాపాణిగ్రహణము చేయ లేదా? అట్లయిన వివాహమునకు గృహాలంకారము చేయించితి నంటివి. ఎవరి వివాహము?

మద—తండ్రీ! ఎఱిఁగి యెఱిఁగి నన్ను మఱల నడుగ నేల? నీ వెవరివివాహము సేయు మని వ్రాసితివో వారివివాహ మే.

భాగు—నే నెవరివివాహము చేయు మని వ్రాసితిని?

మద—విషయకు వివాహము చేయవలసిన దని.

భాగు—ఎవరి కిచ్చి వివాహము చేయుమని వ్రాసితిని?

మద—చంద్రహాసునకిచ్చి.

భాగు—(మిక్కిలి యాశ్చర్యముతో) ఎట్టెట్లు! మనవిషయను—చంద్రహాసునకిచ్చి వివాహము సేయు మని నేను నీకు వ్రాసితినా? అది నాజాబగునా? వివాహమైనదా?

మద—(ఆశ్చర్యముతో) అయ్యో! ఏమి యీమాయ? మీచేతులతో మీర ట్లు వ్రాసి యిప్పుడు లేదనుటకు నేను కారణ మూహింపఁజాలకున్నాను. వివాహమైనది. ఇదిగో మీరు వ్రాసినలేఖ?

భాగు—నీ వపార్థము చేసికొని యకార్యముఁ జేసితివి. (అని లేఖ జదువుకొని తనలో) హా! ఏమి? ఇది నాయక్షరము? ఇది నావ్రాతయె? ఈచంద్రహాసహంతకుని విషప్రయోగము జేసి కడతేర్పు మని నేను విస్పష్టముగా వ్రాసియుండ, విషయ నితని కిమ్మని యిం దుండుటకుఁ గారణ మేమి! లిఖించునప్పుడు నాహస్తము కంపించి యుండునా? నాహస్తమేమి, కంపించు టేమి? ఉక్కుకంబముపలె నిశ్చలమై యుండు

నుగాని యది కంపించునా? అప్పుడు నామది చలించియుండునా? నామతియేమి చలించుటేమి?

క. చలియింపవచ్చు మేరువు,
చలియింపగవచ్చు శీతశైలము, మిన్నుకా
జలియింపవచ్చు, నామతి
చలియింపదు చిక్కులెన్ని సంభవమైనన్. 3

ఒకవేళ మనంబునం దోఁచినకల్పన మంతయుం దా వ్రాయఁ దలఁచినపద్యము నందుఁ బొందుపఱుపలేనిదుష్కవియట్లు, మనోనిర్మితమైనయాకృతిఁ జిత్తరువున లిఖింపలేని యసమర్థశిల్పియట్లు, నాతలంచినవిషయము నేను లిఖింపలేకపోయితినా? నే నట్టి యసమర్థుఁడనా? నన్ను నేఁ గొనియాడుకొనుట దుర్వినయం బగును గాని మందప్రజ్ఞులై మలినమనస్కులై భావివర్తమానస్థితిపరిజ్ఞానశూన్యులై స్వామికార్యనిర్వహణప్రవీణతయం దసమర్థులై యెందుకుంగొఱగాక యుండెడుసధమమంత్రులవంటివాఁడనా నేను? కాను. ముమ్మాటికిఁ గాను. ఐన నిట్టిపొరబా టేల రావలయు? ఇది నా పొరబాటు గాదు. నామనశ్చాంచల్యము గాదు. నాహస్తకంపనము గాదు. ఈచంద్రహాసహతకుఁడె మార్గమధ్యమున నేను వ్రాసినజాబు విప్పి చూచి యది తన కపాయప్రదముగా నుండుటం జేసి యిట్లు గిద్ది యుండవచ్చు. ఏమేమీ! కుంతలరాజ్యభారధురంధరుఁడై రాజనీతివిశేషతృణీకృతదేవదానవగురుండై షష్టిహాయనానుభవసంపన్నుఁడై భూమండల మంతయు గడగడ వడఁకించి మూర్ధాభిషిక్తు లగుకువలయాధీశుల గులాములనుగఁ జేసి, యవనీపతి నాచేతికీలుబొమ్మగా నామనస్సే యతనిమనస్సు గా నానోరె యతనినోరుగా దిగంతదంతిదంతవిశ్రాంతయశస్కుండనైన నేను నేఁటికాలమున, మొట్టమొదట దిక్కులేక నాయెంగిలికూడుం దిని బ్రతికినయీచంద్రహాసహతకునిచేత — చిన్నిపీనుఁగుచేత — నీనిర్భాగ్యునిచేత — నడిమిసిరిచేఁ బ్రుళ్ళిపడుచున్న యీనరపశువుచేత — నిట్లు వంచింపఁబడుదునా?

తే. గీ. ఏడుసంద్రముల్ గడచినయీఁతగాఁడు
పిల్లకాలువలోఁ బడి చెల్లినట్లు
నింతబ్రతుకు బ్రతికి తుద కితనిచేత
నేను వంచింపఁబడుదునే దీనుఁడట్లు. 4

మద — తండ్రీ! ఈజాబు నీవు వ్రాసినదేనా?

భాగు — ఆహా! నేను వ్రాసినదే.

మద — అట్లయిన నేను చేసినయకార్య మేమి? చేసికొన్న యపార్థ మేమి?

భాగు—(తనలో) దురాత్ముఁడైనచంద్రహాసహతకుని వంచనముచేత వివాహమైనది. ప్రాణపీడన మగుటకు మాఱుగా నితనికిఁ బ్రాణిపీడన మయినది. దీనికిం దగిన ప్రతిక్రియ గావించెద. అంతవఱకు నే నేవో మాయమాటలు చెప్పి యీవివాహము కసహ్య మని వీరు తలంపకుండునట్లు నాటకపాత్రమువలె నపారప్రేమ నభినయించి చంద్రహాసునిం జెఱిపెద.

మద—తండ్రీ! ఇందు నా దోస మేమో చూపవైతివి.

భాగు—కుమార! ఇందు నీదోసము లేదు. ఇది నాదోసమే. ఎట్లంటేని, మన విషయను జంద్రహాసున కిమ్మని యింద్రదత్తుఁడు నన్ను బహువిధములఁ బ్రార్థించెను. చిరమిత్రులమైన మే మిరువురము ప్రియమార విం దారగించి మద్యపానము జేసితిమి. ఆ సమయమున నాచేత నింద్రదత్తుఁ డీజాబు వ్రాయించెను. అట్లే కాకున్న వరుఁ డెంత గుణవంతుఁ డైనను సంబంధ మెంతశ్లాఘ్య మైనను నేను లేనప్పుడు వివాహముసేయు మని వ్రాయుదునా? ఒడ లెఱుంగనిశవ ముండునా?

మద—ఐన నేమి! కాలుజాఱి మెత్తనిపానుపుమీఁదఁ బడిన ట్లయినది. చంద్రహాసునివంటివరుఁడు వేయిసంవత్సరములు తపస్సుచేసినను మనకు దొరకఁడు. కావున మన మిందు విచారింపవలసినది లేదు.

భాగు—ఔను! అతఁ డెల్లవిధముల మనవిషయ కపేక్షణీయుఁ డైన వరుఁడు.

మద—తండ్రీ! నీయాశీర్వాదముఁ బడయుటకై వధూవరులఁ దోడ్కొని వచ్చెద.

(నిష్క్రమించును.)

భాగు—(తనలో) ఆహా! ఎంతదుష్కాలము సంప్రాప్త మైనది! ఎవనిపీనుఁగును నేఁ గన్నులారఁ జూచి సంతసింపఁ దలఁచితినో వాఁడు మదపుటేనుఁగువలె స్వేచ్ఛగా విహరించుచున్నాఁడు. మీఁదుమిక్కిలి యాదురాత్ముఁడు నాకూఁతు నే వివాహమాడి దానికేగాక నాకుఁగూడ మగఁడై యున్నవాఁడు. వీఁడు కుంతలరాజుకంటఁబడు నేని నాయాశ లడుగంటిపోవా?

ఉ. ఆచిఱుపాయ మాచెలువ మా నెఱజాణతనంబు నానయం
బాచిఱునవ్వు లావినయ మాగుణసంపద లావిలాసముల్
జూచినయంతఁ గిమ్మనక క్షోణితలేంద్రుఁడు ముద్దుకూఁతు నీ
నీచున కీయకున్నె యవనీతల మంతయు వీఁడె యేలఁడే? 5

ఏమీ! నాఁటిజ్యోస్యులమాట నిజమగునా యేమి? అట్లేలయగును! నేను జీవించి యుండఁగా వీఁడు కుంతలరాజ్య మేలఁగలఁడా? ఓయాశావిహంగమ!

మ. ఎలమిన్ నాదుమనంబు నీగఱులపై నెక్కించుకొంచున్ మహీ
తల మాకాశము భూనభోంతరముఁ బాతాళంబునుం ద్రిప్పి కం
తలసామ్రాజ్యము నాకుఁ దక్కనుచున్ ధైర్యంబు గల్గించి కో
ర్కెలు భగ్నంబుగఁ గూలఁ దోయుదువె యారీతిన్ దురిన్ గ్రూరతన్. 6

ఓయాశ! ప్రారంభముల కెల్ల నీవే మూలకారణము.

శా. ఆశాపాశమె దేహజీవులను నెయ్యంబెచ్చ బంధించు నా
యాశానామనదీజలంబుల నరుం డశ్రాంతమున్ గ్రోలు నా
యాశావర్షముచే మనోరథసుసస్యంబుల్ ప్రవర్ధిల్లు నా
యాశల్ వీడుట గొట్టివారి కయినన్ బ్రాణంబులన్ వీడుటల్. 7

ఓయదృష్టదేవతా! ఇంతకాలము నన్ననుగ్రహించి యిప్పుడు నీవు నన్ను విడుతువె.

సీ. మంత్రి నయ్యును మహీమండలం బంతయుఁ బాలించితిని సార్వభౌముఁడట్లు
సామంతనరపతుల్ సర్వకాలమ్ముల నన్గొలిచి నాయిలుగాచు కుక్కలైరి
మధుకైటభారాతిమహిషీలలామంబు శ్రీసతి నాయింటిదాసి యయ్యె
దిగ్దంతిహస్తముల్ స్థిరయశోలతికలు ప్రాఁకుకంబంబులై పరిఢవిల్లె

తే. గీ. పలుకుబడియెంత సుఖమెంత భాగ్యమెంత
విమలయశమెంత యసమానవిభవమెంత
నీయనుగ్రహచంద్రికల్ గాయునాఁడు
నాఁటికృప నిల్వ నాపయి నేఁటికయిన. 8

ఓ ధైర్యలక్ష్మి!

తే. గీ. పిటికికండ నామెయినుండి వెతికివైచి
భయమహాజ్వరమున గుండె వడఁకకుండఁ
గాఁగిలింపుము నన్నొక్కగడియసేపు
పిదప నెంతెంతపనులు సేయుదునో చూడు. 9

కావుకావుమని యేడ్చుపసిపాప లగుమేనల్లురను నిజతీక్ష్ణకరవాలంబున కెరజేయునప్పుడు కంసునిహృదయంబునందును, జనకప్రేరణంబున మాతృసంహారణపరాయణుం డైనప్పుడు భార్గవరామునిహృదయంబునందును, మాతృప్రేరణంబున జనకుం డగుదీర్ఘతమునిఁ గాలుసేతులు గట్టి గంగలోఁ బడద్రోయునప్పుడు వానికొడకుల డెందములయందును, మేనమామ యగుకంసు హింసించునప్పుడు వాసుదేవునిచిత్తంబునందును, నేధైర్య మే యుత్సాహము నెలకొని యుండెనో యాధైర్య మాయుత్సాహము నాహృదయమున

నెలకొని యుండుఁగాక! ఓహింసా! ఓక్రోధమా! ఓమహిషాసురమర్దనీ! క్రూరశీలము లగునోభూతములార! ఓభేతాళుఁడ! ఓపిశాచములార! ఓరాక్షసులార! మీ రిప్పుడు న న్నావహించియుండి దయాదాక్షిణ్యములు నాహృదయమునుండి తుడిచి వైచి నాచేత సాహసంబులు జేయింపుఁడు. చంద్రహాసుని సంహరింపవలె. నాక్రోధ ముపసంహరింపవలె. కాని పాపము విషయ కిట్టియవస్థ కలుగు నని నే నెన్నఁడుఁ దలంపలేదు.

ఉ. మూఁడుదినంబులే న్మగనిపొత్తు ఘటిల్లకమున్నె చిన్నిపూఁ
బోఁడికిఁ దీరఁగాఁ దగినముచ్చట దీరకమున్నె యెంతయున్
వేడుకఁ గంకణాలయిన విప్పకమున్నె హరిద్రవస్త్రముల్
వీడకమున్నె బిడ్డ ప్రజ విస్మయమొంద వితంతు వయ్యెడున్. 10

ఆవైధవ్యము చేతులార నేనే తెచ్చిపెట్టుచుంటి నని నామన స్సించుక సంశయించుచున్నది. మనసా! సంశయింపకు. మెత్తబడకు. ఈడుజోడు సరిపోయిన దని కూఁకటులు గొలిచి మంచిముహూర్తములు పెట్టి సకలజగజ్జననయనాభిరామముగాఁ జేసిన వివాహములలో నెందఱుకన్యకలు వితంతువు లగుటలేదు. అందఱిలో నిది యొకర్తె. దుఃఖ మెల్లకాల మొక్కటేమచ్చున నుండదు. మొదటినాఁటిదుఃఖము రెండవనాఁ డుండదు. రెండవనాఁటిదుఃఖము మూఁడవనాఁ డుండదు. కొంతకాల మేఁగ్గిన యదియే యూరకుండును. వయస్సు గడచినకొలఁది చచ్చినచుట్టములు మఱవఁ బడుదురు.

తే. గీ. నేలఁ ద్రవ్వినగోతులు కాలవశత
నాఁడునాఁటికి మెలమెల్లఁ బూడునట్లు
తీవ్రదుఃఖసంజనితమనోవ్రణములు
మానుచుండును గాలక్రమంబుచేత. 11

మానుఁగాక మానకపోవుఁగాక! ఆమెనిమిత్తమై నాప్రారంభము మానుకొందునా? భర్తృవియోగదుఃఖమున నీమె మృతినొందు నేమొ. మృతినొందిన నేమి? ఏదైనరోగము వచ్చి యీమె యిప్పుడు చచ్చిన నేమి చేయఁగలను?

తే. గీ. చంద్రహాసహతకుఁ గూడి సధవ యగుచు
నెల్లకాలంబు నన్ను హింసించుకంటె
విధవ యగు టెంతొ మేలు తద్విగహమునను
మేను దొరఁగిన మిక్కిలిమేలు నాకు. 12

ఓరీ! ఎవఁడురా, అక్కడ?

[మందరుడు ప్రవేశించి]

మంద—దేవా ! ఆజ్ఞాపింపుడు.

భాగు—మందర ! కాళికాలయరక్షకులైనభీమభైరవులఁ దోడ్కొని రమ్ము. అక్కడఁ గొన్ని పూజలు చేయింపవలయు.

మంద—దేవా ! వా రిప్పుడే యీదారిని బోవుచున్నారు. పిలిచికొని వచ్చెద. (అని నిష్క్రమించి భీమభైరవులతో మరలఁ బ్రవేశించి)
దేవా ! వీరె భీమభైరవులు. నేను పోయి ద్వారమునొద్ద నిలిచెద.

(అని నిష్క్రమించును.)

భీమభైరవులు—దండాలు దేవరా !

భాగు—ఓరీ ! భీమ ! ఓరీ ! భైరవ ! అతిరహస్యమైనకార్య మొకటి మీరు చేయవలయు. నామాటలు మీమనస్సులలోఁ బాఁతుపడి యుండవలయునే గాని యెన్నటికిని పైకి రాఁగూడదు.

భీముఁడు—దేవరా ! చాటుగాఁజంపఁబడినవానిశవమును భూమిలోఁ బూడ్చి పెట్టినట్లు మీమాట మామనస్సులలోఁ బూడ్చిపెట్టుదుము.

భాగు—ఈరాత్రి మీరు ఖడ్గపాణులై కాళికాలయమున నక్కియుండి యెవఁడు దేవికి నమస్కారము చేసి యామె నర్చించునో వాని నచ్చటనె తెగనఱక వలయు. ఇట్లు చేయుదు రేని మీకు లక్షవరహాలధన మిచ్చెద.

భీము—చిత్తము. దేవరా! తప్పక చేసెదను.

భైరవ—లచ్చవరాలే ! దేవర ! నిజముగా లచ్చవరా లిచ్చెదరా ?

భాగు—సందియ మెందుకురా ! నీ కాసొమ్మియ్యకున్న మామదనుం జంపు కొన్నట్లే.

భీముఁడు—భైరవా ! అయ్యగారినోటిమాట వరాలమూట. అనుమానములేదు.

భాగు—ఓరీ ! శిరస్సు శరీరమునుండి వేఱగువఱకు నఱకవలయు. పని సగము సగము చేయరాదు.

భీము—దేవరా ! అమ్మవారికి బలియిచ్చునొప్పుడపోతును నఱికినట్లు నఱికెదను. రేపుపొద్దున గుడికిఁ బోయి నాయేటుసొగసు మీరే మెచ్చవలె.

భాగు—సరే ! కాని, గుడికి వచ్చినవాఁడు గొప్పవాఁ డని తక్కువాఁ డని సంశయింపక సంహరింపవలెనసుఁడీ !

భైర—దేవరా ! అనుమానింపము. మీకొడుకు వచ్చినను సరె. బుఱ్ఱ కొబ్బరిపుచ్చకవలె నెగురఁగొట్టెదము.

భీము—తప్పురా. తప్పు. తప్పు. అలాటిమాట లనకు.

భాగు—ఛీ! త్రాగుబోతులారా! అమంగళములు బలుకకుఁడు.

భైర—దేవరా! బుద్ధి. బుద్ధి. పొరబాటు పొరబాటు.

భాగు—ఓరీ! మీ రింకపొండు. ఓరీ! ఈపని మీరు సేయకున్నను నీమాటలు బైలుపుచ్చినను మీచర్మ మొలిపించి నెత్తురు కుక్కలు నక్కలు నాకునట్లు కొరత సేయించెద.

భీమ భైరవులు—దేవరా! మీపరిభావ మెఱుఁగమా! అలాగే చేయుదుము.
(అని నిష్క్రమింతురు.)

భాగు—(తనలో) ఈపని వీరు నిర్వర్తించినయెడల లక్షవరహాలు తప్పక యిచ్చెద. కాళికి వేయిగొఱియలను నూఱుదున్నపోతులను బలియిచ్చెద. జంతువుల నెత్తురుతో నామె కభిషేకము జేసెద.

[అంతట మదనుఁడు చంద్రహాసుని విషయను దోడ్కొని ప్రవేశించును.]

చంద్రహా—కల్యాణీ! తండ్రిని జూడఁబోవునప్పుడు నీ కింతభయ మేల?

మదన—మాయయ్య లోకు లందఱికట్లె మాకును భయహేతువే. మాయయ్య యొద్ద నా కెంతచన వున్నదో యంతభయ మున్నది.

విషయ—మాయన్నమాట నిజము. (తనలో) నాప్రాణేశ్వరునికి విషప్రయోగము చేసి చంపవలసిన దని వ్రాసినమాతండ్రి యిప్పుడీయన కేమియపకారము చేయునో యని మిక్కిలిభయ మగుచున్నది. భగవతీ! కాత్యాయనీ! నీచరణమే శరణము.

భాగు—(తనలో) అదె! నూతనవధూవరులు వచ్చుచున్నారు. అబ్బ! వీరి నెట్లు చూతును? ఎట్లు వీవింతును? అబ్బ! ఈచంద్రహాసహాతకుని జూచినతోడనే పెనుఁగుం జూచినట్లు నా కేవగలుగుచున్నది. ఈతనిదర్శనము నా కసహ్యముగా నున్నది. శరీర మాపాదమస్తకము నగ్ని సోకినట్లు మండుచున్నది. వీఁడు నాపాలిఁటి యముఁడై నాచేత భూలోకనరక మనుభవింపఁ జేయుచున్నవాఁడు. అయినను నీయసూయ దిగమ్రింగి నిస్తరంగసముద్రమువలె నే నగుపడవలెను.

మదను—తండ్రీ! వీరె వధూవరులు వచ్చియున్నవారు.

భాగు—కుమారా! చూచుచున్నాను. ఆనందాతిశయమునఁ బలుకలేకున్నాను.

చంద్ర—మామా! (అని యభివాదము చేయుచున్నాఁడు.)

భాగు—(తనలో) శీఘ్రమేవ మరణప్రాప్తిరస్తు. (ప్రకాశముగ) ఈప్సితార్థసిద్ధిరస్తు!

విష—తండ్రీ! నమస్కారము.

భాగు—(తనలో) శీఘ్రమేవ వైధవ్యప్రాప్తిరస్తు? (ప్రకాశముగ) కల్యాణమస్తు!

చంద్ర—మహాత్మా! భాగురాయణ! నీసంకల్పము ప్రకారము కల్యాణమే చేకూరినది. జగత్కల్యాణసంధాయకుఁడైన పరమేశ్వరుని యనుగ్రహమున్న పక్షమున నే సంకల్పముసిద్ధింపదు!

భాగు—వత్స! ఆవిషయ మటుండనిమ్ము. వివాహితుఁడైనపురుషుఁడు కాళికి నమస్కరించుట మావంశసాంప్రదాయము. కావున నీ వీసాయంకాలము కాళికాలయమున కరిగి యాదేవి కభివాదము చేసిరమ్ము! దాన నీవు నిరంతరాభ్యుదయంబులు చిరాయురారోగ్యంబులునగు. నాకు మదనుఁ డొకకన్ను, చంద్రహాసుఁ డొకకన్ను. రెండు కన్నులుఁ జల్లఁగా నుండుటే నాకోరిక.

చంద్ర—అట్లు చేసెద. జగత్కుటుంబినీసేవ కుటుంబవృద్ధికరము.

భాగు—ఇంక నే నభ్యంతరమందిరమున కరిగెద. అమ్మాయి! నన్ను మీయమ్మకడకుఁ దీసికొనిపొమ్ము.

విషయ—అయ్యా! ఇదె వచ్చుచున్నాను. (తనలో) ఈకాళికాభివాద మేమిమాయయగునో యని భయము గలుగుచున్నది.

(అని విషయయును భాగురాయణుఁడును నిష్క్రమించుచున్నారు.)

చంద్ర—మదన! సాయంకాల మైనది. చూడు.—

ఉ. కాలభుజంగవక్త్రమును గప్పలకైవడిఁ జొచ్చి యీజగ
జ్జాలమునం జరాచరపదార్థము లన్నియు ముందువెన్కని
ర్మూలమునొందు నిప్పుడు సరోరుహబాంధవుఁ డంతు వచ్చుటం
గూలు నతండు మృత్యువునకుం ఘను లల్పులు తుల్యులే గదా!

మద—చూచుచున్నాను. ప్రకృతియందలి వైచిత్ర్యముఁ గనిపెట్టితివా?

మ. సహజంబైనగుణంబె యంత్యమున విస్పష్టంబుగాఁగన్ మహో
మహులం దైనను దోఁచునంట కిపు డీమార్తాండుఁడే సాక్షి సూ
ర్యమహారారంభమువేళఁ గన్పడినయాయారుణ్యమే వీనియం
దహహా! గన్పడుచున్న దీచరమసంధ్యాకాలమం దేనియున్

చంద్ర—

తే. గీ. రాగమునయందె యీతండు ప్రభవ మొందె
రాగమందె యీతండు మారణము నొందు
నట్టిచండగభస్తిని హంస యంచుఁ
బలుకు టిది పక్షపాతంబుఫక్కి గాదె,

మద—తే. గీ. అస్తమానోదయములఁ బ్రత్యహమునందు
నంశుమంతునిఁ దెలిగొల్ల నరసి చూడ
జంతుసంతతికి మరణానంతరమున
జన్మమగుచుండు నని తోఁచు స్వాంతమందు.

చంద్ర—మదన! సాయంకాల మైనదిగనుక నేనింక దేవీసమారాధనమునకరిగెద.

మద—కొంతకాల ముండుము. రాజదర్శనముజేసిపోవచ్చును.

చంద్ర—చంద్రోదయ మగునంతదాఁక వేచియుండిన నాలస్యముగాదా?

[అప్పుడు గాలవుఁ డను బ్రాహ్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మద—రాజపురోహితుఁడును సాంగవేదాధ్యయన సంపన్నుఁడు నగుగాలవుఁ డీలోకోయిటు వచ్చుచున్నాఁడు.

గాలవు—(తనలో)ఇతఁడు జామాత యగు నేని మామహారాజు నిజముగాఁ జరితార్థుఁ డగును. కాని నూతనవధూపరిరంభణప్రీతుఁ డైన యీతఁడింతత్వరలో నన్యకాంతాసక్తుఁ డగునా? ఎట్లయినఁ బ్రయత్నము కార్యము గదా!

చంద్ర—ఈతని మొగమున బ్రహ్మతేజ ముట్టిపడుచున్నది.

ఇద్దఱు—పుంభావ మొందిన నిగమచతుష్టయమునకు నమస్కరించుచున్నాము ఈపీఠముమీఁద నాసీనులుగండు.

గాలవు—అభ్యుదయమస్తు! (అని కూర్చుండును.)

మద—మహాత్మా! మీ రిందు విజయముచేయుటకుఁ గారణమేమి?

గాలవ—మహారాజుగారు చంద్రహాసునిఁ దమసన్నిధికిఁ దోడ్కొనిరమ్మని సెలవిచ్చిరి.

చంద్ర—అనుగ్రహింపఁబడితిని. కాని, నే నిప్పుడు కాళికాలయమున కరుగవలయును.

గాల—రాజదర్శనానంతరమున నచ్చటి కరుగవచ్చును.

చంద్ర—అప్పటికి మిక్కిలిప్రొద్దు పోవును. మదన! ఏమిచేయుదము?

మదను—అయ్యా! నీకు మారుగాఁ గాళికాలయమున కరిగి నేను దేవికి నమస్కరించి వచ్చెద. రాజాజ్ఞ యవిలంఘనీయము గావున నీవు తద్దర్శనార్థ మరుగుము.

గాల—అట్లు చేయుట సముచితము.

చంద్ర—మీతండ్రిగారీపనియందు నన్నే నియోగించిరి. నీవరుగుటయుక్తమా?

మద—ఈపని నెవరుచేసినను దోషము లేదు. నీవు పొమ్ము.

చంద్ర—మంచిది. (అందఱు నిష్క్రమింతురు.)

## రెండవరంగము.

---

### భాగురాయణమందిరము.

[అంతట భాగురాయణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భాగు—(తనలో)

తే. గీ. విద్దెములు చేసి పసిబిడ్డ విసుగు లేక
పడుచు లేచుచు నడక నేర్చెడు తెఱఁగున
నరుఁడు సైకతడవలఁ బన్నములు నడచియు
యత్నములు చేసి కృతకృత్యుఁ డగుటహితము. 17

అందుచేతనే చంద్రహాసుఁడు తొలుదొల్త వాంతలచేత విడువఁబడినను బిదప విషప్రయోగఖండము గడచి విషయాపాణిగ్రహణధన్యుఁ డైనను వానివిషయమై నే నీప్రియత్నము చేయుచుంటిని. నే నొక్క పొరపాటు చేసితిని. చందనావతినుండి వీఁడు కుంతలమునకు వచ్చునప్పుడు మార్గమధ్యమున నామనుష్యులచేత వీనిం జంపించవలసినది. అయిన నిప్పు డేమాయె ?

క. నామానస మనిమొడిపెను
పాములపెట్టె గలుగ నుపాయములనుబల్
పాములకును గొరయున్నదె
యామూర్ఖునిఁ జంపలేవె యాసర్పంబుల్. 18

ఈబాలిశుఁడు కడతేఱినయెడలఁ జందనావతియల్లె కుంతలంబును నాయధీనంబగు.

[అప్పు డొక సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సేవకుఁడు—దేవా ! జయముజయము.

భాగు—ఓరీ ! వసంతక! చందనావతినుండి యెప్పుడు వచ్చితివి? అచటివృత్తాంతము లేమి ?

వసంత—దేవ ! ఏమిచెప్పుదును. మీరుచంద్రనావతి విడచినతోడనే కట్లు విప్పుకొన్న వేటకుక్కలవలెఁ బురజనులు చుట్టుప్రక్కల నున్నపల్లియలజనంబులఁ దోడుచేసికొని స్వల్పవిజయమదోన్మత్తుఁ డైనయుగ్రసేనునిబట్టి చంపి యింద్రదత్తునిఁ జెఱవిడిపించిరి. బంధవిముక్తుఁ డైనయింద్రదత్తుఁడు దేవరవారిచ్చెదముల నేలికకు విన్నవింప నొకటిరెండుదినములలో నిటవచ్చునఁట.

భాగు—(ఆశ్చర్యముతో) ఏమీ ! ప్రజలు తిరుగఁబడిరా ? మహావీరుఁడైనయు గ్రసేనుని సంహరించిరా ? ఇంద్రదత్తునకు బంధమోక్షణ మయ్యెనా ? నేను లేకపోవుటచేఁ గట్టతెగినచెఱువులోనినీళ్ళవలెఁ బ్రజలు విజృంభించిరి కాఁబోలు ! ఆహా ! ప్రజాశక్తిముందర రాజబలము నిలువఁ జాలదు.

తే. గీ. గాలి కెగిరిపోయెడువట్టిగడ్డిపోఁచ
లెల్ల వెంటి యై మత్తగజేంద్ర నయినఁ
గట్టఁగలయట్లుఁ బ్రజలెల్లఁ గలిసిరేని
ప్రబలరాట్ఛక్తినైనఁ దిరస్కరింతురు.

హా ! యుగ్రసేన ! నాకతమున నీకెంతదురవస్థ సంభవించినది ? ఈతనిచావును నొకవిధముగా మేలె ! విషయ పరాధీన యైనందుల కితఁడు బ్రతికియుండెనా నాపైఁ దప్పక నలుగును. ఇతనిసహాయ మపేక్షణీయమే గాని దానియవసరమైనప్పు డుపాయాంతర ముండదా ? ఇంద్రదత్తుఁడు రాజుతో నాపై నేరములు చెప్పునా? సరే! వీఁడా రాజదృష్టిలో నన్నల్పునిజేయువాఁడు! సరే! వసంతక ! నీ విఁక పొమ్ము.

వసంత—చిత్తము దేవా !

(అని నిష్క్రమించును.)

భాగు—(తనలో) చంద్రహాసుఁడు గృహమందు లేఁడు. తప్పక యమాలయమునకే యరిగి యుండును. కాదు కాదు. యమాలయమున కరిగి యుండును. భీమభైరవు లీపాటికి వాని నంతకాలయమున కతిథిం జేసియుందురు.

[అంతట భీమభైరవులు ప్రవేశించుచున్నారు.]

ఇద్దరు—దేవా ! జయము. జయము.

భాగు—కృతకృత్యులై వచ్చిరా లేదా ?

భీముఁడు—మీయాజ్ఞ యెన్నఁడైన మోఘ మైనదా !

భైరవ—దేవరా ! గొఱ్ఱెపోతును నఱికినట్లు నఱికినాము.

భాగు—(సంతోషముతో) నిశ్చయమేనా ! నిశ్చయమేనా ? దొంగముండకొడుకులు మీరు. కడుపుకక్కురితిచేత నించుక లంచము పుచ్చుకొని విడిచిరా ?

భీము—లేదు. దేవరా! లేదు. ఏలినవారిపాదములతోడు. అతఁడెవఁడో చీఁకటిచాటున మేము చూడలేదు. అమ్మవారికి దండము బెట్టుటకు నేల సాగిలపడఁగానే యంతకుమున్ను గంబములచాటున నక్కియున్న మేము చివాలునఁ బోయి నఱికితిమి. చూడు దేవరా ! మాబట్టలమీఁద నెత్తురు.

భాగు—(చూచి) బాగు ! భీమ ! బాగు మేలు భైరవా! మేలు. మీరు

నామిత్రులు. మీరు నాప్రాణమిత్రులు. మీఋణము దీర్చుకొనఁజాలను. చచ్చినప్పుడు వాఁడేమైనఁ బలికినాఁడా?

భీము—మాట లేదు. మంతిలేదు దేవరా! పడుచున్నవాఁడు పడుచున్నట్టె కడతేరెను.

భాగు—శహబాస్! భీము! శహబాస్! లక్షవరహాలు గాక మీకిరువురకుఁ జెఱియొకగ్రామ మిచ్చెదను. రేపుదయము వచ్చి నన్నుఁ జూడుఁడు.

భైర—దేవరా! కల్లునీళ్ళకీరాత్రి డబ్బులేదు.

భాగు—ఇదిగో! చెఱియొకవరహా యిచ్చుచున్నాను. పట్టుకపొండు.

ఇద్దఱు—చిత్తము దేవరా!

(అని నిష్క్రమింతురు.)

భాగు—(తనలో)

తే. గీ. ఇపుడు శాంతంబు నెలకొనె హృదయమందు
నిపుడు నాదుకోరిక ఫలియింపఁ గలిగె
నిపుడు నిష్కంటకంబయ్యె నీధరిత్రి
యిపుడు హృదయశల్యం బూడి యిలఁ బడియె. 20

అమ్మయ్య! ఇంతకాలమున కిప్పుడు స్వేచ్ఛగా నూపిరి పుచ్చుకొంటిని. ఇప్పటికి హృదయమునుండి మహాభారము దింపుకొనఁగల్గితిని. నేఁటికి వీనినెత్తురు కంటఁ జూచుభాగ్యము గల్గినది. "అన్నియు రాజచిహ్నములె" (యను మొదటియంకములోని పద్యము నిండాగర్భముగాఁజదివి) ఆజ్యోతిష్కులిప్పు డెక్కడున్నారో? చంద్రహాసుఁడు పరలోకమును బాలించునని వారు తమమాజల కిప్పుడగ్గము చెప్పుచుందురుగాఁబోలు! గ్రహచారములను మార్పఁగలిగినట్టియు బ్రహ్మవ్రాత దుడిచివేయఁగలిగినట్టియు భాగురాయణమహామంత్రిప్రజ్ఞ వా రెఱుఁగరు. ఓకుంతలరాజ్యలక్ష్మి! నీ విప్పు డెందరిగెదవు? నీ కిష్టము లేకపోయినను నీకీల్జడఁబట్టి యీడ్చి నిన్ను మామదనునికౌఁగిటిలోఁ బడవైచితినిసుమీ! వృద్ధరాజు రేపో నేఁడో చావకమానఁడు. కాలవశమున నతఁడు వేగమ కడతేఱకున్న వెలబొమ్మవోలె గద్దెయెక్కి దిగని యీముసలికొండ్రముచ్చును విషప్రయోగము చేతఁ గడతేర్చెద. ఇంక నాలస్యము చేయరాదు. పాపము! విషయ మెఱుగమి నే నెట్లుచూతును! అది నాపయిఁబడి యేడ్చినప్పుడు నే నేమని యూరడింతును? దానితోఁ గలిసి నేనును నేడ్చెదను. చంద్రహాసమాతకుని గూడఁబట్టి దాని కీయవస్థ ప్రాప్తించినది. మాలిన్యసంపర్కము గలబంగారము సైతము దగ్ధము కావలసినదే గదా! పాలతోఁ బాత్ర కాఁగవలయును. వడ్లతోఁ దట్ట యెండవలయును. కావున నీవిషయము విచారింపఁ గూడదు.

[తెరలోఁ గలకలము]

భాగు—(ఆలకించి) ఓరీ! యెవఁడురా యక్కడ. ఆకలకల మేమో తెలిసి కొనిరా?

[మందరుఁడు ప్రవేశించి]

మంద—దేవా! తెలిసికొని వచ్చితి. చంద్రహాసకుమారుఁడు మహారాజుగారి పట్టపుటేనుఁగుపై నెక్కి యూరేగుచు నిట వచ్చుచున్నాఁడు.

భాగు—(ఆశ్చర్యముతో) చంద్రహాసకుమారుఁడా! ఓరిమూర్ఖుఁడా! నీవు త్రాగితివా? పిశాచము సోకినదా? ఒడలెఱుఁగక ప్రేలుచున్నాఁడు.

మంద—(తెల్లబోయి) మహాప్రభూ! నేను సత్యమే తెలియఁజేసికొన్నాను.

భాగు—ఏనుఁగు నెక్కి వచ్చుచున్నాఁడా; ఏనుఁగు నెక్కి వచ్చుచున్నాఁడా? ఏనుఁగుమీఁదఁగాదు. చంద్రహాసుఁడు యమునియెనుబోతుమీఁద నెక్కినాఁ డనుము.

మంద—దేవరవారిమాటలు నా కర్థము గాకున్నవి.

భాగు—చంద్రహాసుఁడు దయ్యమై వచ్చినాఁడా? భూతమై వచ్చినాఁడా?

మంద—(తనలో) ఏమిది! యీయన యవ్యక్తముగా మాటాడుచున్నాఁడు. మద్యపానము జేసియుండునా? (ప్రకాశముగ) దేవా! ఆయన నిజముగా నిట వచ్చుచున్నాఁడు. అదిగో! ఏనుఁగు దిగినాఁడు.

భాగు—(తనలో) ఏమియీయాశ్చర్యము! ఇపుడే వానిని జంపితి మని హంతలు చెప్పిరి. చచ్చినవారు పిశాచము లగుట కలదుగాని యింతత్వరలోనే పిశాచరూపముఁ దాల్తురా? అయినను పిశాచములు నడిరేయిఁ దిరుగులాడునుగాని జామురాత్రి గాకమునుపే యేనుఁగునెక్కి బైలుదేఱునా?

తే. గీ. చంద్రహాసహతకుఁడు పిశాచమైన
నుగ్రతరము లౌ మారణహోమములను
మాంత్రికులచేతఁ జేయించి మద్గృహంబు
నిష్పిశాచంబు జేసెద నిముసమందు.

(అంతటఁ జంద్రహాసుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భాగు—(చూచి) హా! యేమిది! వీఁడు నిజముగాఁ జంద్రహాసుఁడే! దురాత్ములైనభీమభైరవులచేత నేను వంచింపఁబడితిని. దేవీసమారాధనమునకై కాళికాలయమున కరిగినమందభాగ్యు లెవ్వరినో వారు నఱికియుందురు. హా! ఎంతకష్టము! నరహత్య యైనది గాని మనోరథసిద్ధి కాలేదు. దైవము వీనిపట్ల సంపూర్ణముగా నున్నాఁడు.

చంద్ర—మహాత్మా! భాగురాయణా! నమస్కారము.

శా. నీయారంభము దైవయోగమహిమన్ నేఁడే తుదిం దాఁకెడున్
నీయాదేశము చేత వచ్చి మొదలన్ నీకూఁతుఁ జేపట్టితిన్
నాయందున్ గరుణించి కుంతలమహీనాథుండు కన్యామణిన్
స్వాయత్తంబగు రాజ్యమున్ స్వయముగా నాకిచ్చె నిశ్చింతతోన్.

ధూ—ఏమీ! కుంతలేంద్రుఁడు చంపకమాలను, రాజ్యమును నీ కిచ్చివైచెనా?

చంద్ర—నీయాశీర్వచనప్రభావమున నట్లే జరిగినది.

ధూ—(తనలో) హతోస్మి హతోస్మి. హా! యెంతపని జరిగినది! ఈదురాత్మునియందు మామదనునికంటె నేమిగుణము లున్నవని రాజు కన్యకను, రాజ్యమును, వీనికి సమర్పించెను? ఛీ! రాజు బుద్ధిమాలినవాఁడు. లక్ష్మి మతిలేనిది. గుర్తింపుండ. ఈ చంద్రహాసహతకుఁడు రాజా? నేను వానికడ మంత్రినా? హేయవస్తువట్లై వీనిమొగము నాకు వమనపోతు వగుచున్నది. (ప్రకాశముగ) కుమారా! సంతోషము. సంతోషము. కాని నీవు దేవాలయమున కేల యరుగలేదు. ఇప్పుడు పోదువా?

చంద్ర—మహాత్మా! మీయాజ్ఞోల్లంఘనము జేసినందులకు క్షమింపవలయును, మహారాజనసగముగా నమ్మని గాలవునిచే నాహ్వానము సేయుటచే నే నటకుఁ బోవలసివచ్చెను. నాబదులు మదనుఁడు దేవీసమారాధననిమిత్త మాలయమున కరిగెను.

ధూ—(తెల్లఁబోయి) ఏమీ! మదనుఁడే వెళ్ళెనా? మదనుఁడె? మదనుఁడే! నిశ్చయముగా మదనుఁడె! అతఁ డింకను రాలేదు. నేను బోయి యరసెద. నీవు లోపలికిఁ బొమ్ము.

చంద్ర—పరిచారకులను బంపి యతనిజాడ లరయవచ్చును. పెద్దలు మీ రేలకొ మపడవలెను?

ధూ—కాదు కాదు. నావెంట నెవ్వరు రావలదు. నే నొక్కఁడనే పోయి దేనికి నమస్కరించి మదనుం దోడ్కొని వచ్చెద. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

మూఁడవరంగము.

కాళికాలయము.

చచ్చిపడియున్న మదనుఁడు; ధూష్టబుద్ధి ప్రవేశించుచున్నారు.

ధూ—(కుమారునిశవముఁ జూచి) హా! కుమార! హా! అలోకసామాన్యరూపవినిర్జితమదన! హా! సకలసద్గుణరాశి! హా! అఖిలవిద్యాపారంగత! అన్నా! మహాపాపిష్ఠుఁడనై చేతులార నిన్ను జంపుకొంటిని. హా! ఎంతకష్టము. నీవంటి గుణాఢ్యుఁడు ప్రపంచమునఁ గలుగు టరిది. హా! మదన! కుంతలసామ్రాజ్యము నీ

ఈయవస్థలో నాకు మహోపకారము జేయఁగలదేవత యొకర్తె యున్నది. దానినే యాశ్రయించెద. భాగురాయణచరిత్రాద్భుతప్రబంధమం దిదె కడపటియంకము. తెరపడ వలసిన యవసరము వచ్చినది.

తే. గీ. దుర్జయాశాకళత్రవిసర్జితునకు
సృష్టదేవతానుగ్రహభ్రష్టునకును
మృత్యువా ! నీకె మిగిలినమిత్రి వింక
గౌఁగిలింపుము యిటు వచ్చి కరుణ నన్ను. ౬౦

(అనిపొడుచుకొని చచ్చుచున్నాఁడు.)

ఇది సప్తమాంకము.

గ్రంథము సమాప్తము.



సవరణ. 77 పుట. 7 పంక్తి 'మనసైనమిత్రమిత్రుఁ' 'మనసైనమిత్రుఁ'